

# నేర్చుకొనుటకు పశితనం ప్రతిబంధకంగాదు

తానే స్వయంగా దుస్తులు ధరించు కొనుటను అభ్యసించే పశిబాలుడు అప్పుడే యువకునితో సమానం. స్వయం కృషిపైనాధార పడియుండుటను మరియు బలంగా పెరుగుటను అతనికి నేర్పండి.

మీ పిల్లలకు మీరు ఇప్పుడు నేర్పవలసిన మరియొక పాఠము. పళ్లు మరియు పసుచిగుళ్ల పట్ల రోజూ శ్రద్ధవహించుట, అందువల్ల భవిష్యత్తునందు కొన్ని సంవత్సరాలలో దంతక్షయం మరియు పసుచిగుళ్ల జబ్బులబారి బడకుండా వారిని కాపాడినందుకు వారు మీకు అభివందనములర్పింతురు. వారి పళ్లను మరియు పసుచిగుళ్లను ఫోర్‌హాన్స్ టూత్ పేస్టుతో తోముకొనుచూ భద్రపరుచుకోమని మీ పిల్లలకు నేడే బోధించండి. దంత వైద్యుని చేత తయారు చేయబడిన ఫోర్‌హాన్స్' పసుచిగుళ్లకు గుణకారియైన డాక్టర్ ఫోర్‌హాన్ యొక్క ప్రత్యేక పదార్థములు గల టూత్ పేస్టు ప్రపంచంలోకెల్ల ఇది ఒక్కటే. రోజూ వాడుచున్నయడల పళ్లు తెల్లగా మెరయుచూ, పసుచిగుళ్లు గట్టిగాను ఆరోగ్యవంతంగాను వుండును. "CARE OF THE TEETH AND GUMS" అనే చిన్న రంగుల పుస్తకం ఉచిత ప్రతి కోసం తపాలా ఖర్చుల నిమిత్తం 10 న.పై. తపాలా బిళ్లలను పంపండి: మేనర్స్' డెంటల్ అడ్వయిసరీ బ్యూరో, పోస్టు బ్యాగ్ నం 10031, బొంబాయి.




C. I

## COUPON

Please send me a copy of the booklet
"CARE OF THE TEETH AND GUMS"

*Name* ______________________

*Address* ______________________

______________________

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ, మరి ఎన్నో ఆకర్షణలు.


బంగారు కవరింగ్

రాజా




BALLS BENGAL EAR RINGS










DESIGN EAR RINGS BIG SIZE Rs. 3·00. MEDIUM Rs. 2·50. SMALL Rs. 2·00. PER PAIR.



RAJA.1421. Rs 4·00 PAIR



RAJA.1422. Rs. 4·00 PAIR.

SPECIAL STONE RING Rs. 10·00







కొ్యటలాగుకు, నగలకు, హెడ్ ఆఫీసుకు వ్రాయండి.

2·4" SIZE Rs. 10·00... 2·2 SIZE Rs. 9·00 PER PAIR.

రాజాగోల్డు కవరింగ్ వర్క్సు (REGD) POST BOX No. 38. H.O. మచిలీపట్నం.

సెల్సుబ్రాంచీలు: గవర్నరుపేట విజయవాడ 2 - మెయిన్‌బజారు ఏలూరు - చిక్కడపల్లి హైదరాబాద్. 20

# జలుబు నొప్పులతో మీ బిడ్డను బాధపడనీయకండి

## విక్స్ వేపోరబ్ తక్షణమే ఉపశమనాన్ని కలుగజేస్తుంది... మీ బిడ్డ సులభంగా శ్వాస పీల్చుకొనుటకు సహాయపడుతుంది... రాత్రంతా సుఖంగా నిద్రిస్తాడు

మీ బిడ్డ మంచి-చెడ్డలను చూడవలసిన బాధ్యత మీది. అందు చేత బిడ్డకు జలుబు నొప్పులు వచ్చినప్పుడు, ముక్కునుండి నీరు కారుట, కండ్లనుండి నీరుకారుట, గొంతు బొంగురు పోవుట, శ్రమతో శ్వాస పీల్చుకొనుట మొదలయిన మొదటి జలుబు చిహ్నాలు కనుపించిన వెంటనే విక్స్ వేపోరబ్‌ను పులమండి.

మీ బిడ్డ జలుబుకు విక్స్ వేపోరబ్ అత్యుత్తమమైన నివారిణి ఎందుచేత నంటే ఇది జలుబు బాధిత భాగములన్నింటిలో, ఎచ్చట జలుబు ఎక్కువగా బాధిస్తుందో, అనగా, ముక్కు, గొంతు, ఛాతీలలో చాలా గుణకరంగా పనిచేస్తుంది. మీ బిడ్డ యొక్క మృదువైన చర్మానికి ఇది చాలా మంచిది.

విక్స్ వేపోరబ్‌ను పులిమి, ఉన్ని బట్టతో కప్పి, మీ బిడ్డను సుఖంగా పరుండబెటండి. రాత్రంతా మీ బిడ్డ సుఖంగా నిద్రించే సమయములో విక్స్ వేపోరబ్ దాని ప్రభావాన్ని కొనసాగిసూ వుంటుంది. ఉదయానికల్లా అతి చెడ్డ జలుబు కూడా పూర్తిగా పోయి, మీరు అమితంగా ప్రేమించే మీ గారాబు బిడ్డ సంతోషంగా మేలుకొంటాడు.




# విక్స్ వేపోరబ్

3 సైజులలో

VV 464.

తప్పక చూడండి!

డి.వి.ఎస్.ప్రొడక్షన్స్ వారి

# మంగమ్మ శపథం

దర్శకత్వం
బి.విఠలాచార్య

నిర్మాత
డి.వి.ఎస్.రాజు

ఆంధ్ర పూర్ణా పిక్చర్స్
నైజాం:ఉషాఫిలింస్ • సీడెడ్: ఎస్.ఎ.డి

మైసూరు - సదరన్ మూవీస్ రిలీజ్. మైసూరు నార్తు - వాణీ పిక్చర్స్ రిలీజ్.

# అదేముంది!
# ఆ గుప్పిట్లోవి
# ప్యారి మిఠాయిలు

పిల్లలికి రుచికరమైన మంచి పుష్టికరమగు ప్యారీమిఠాయిలను ఇట్టే కనిపెట్టేశే శక్తిఉంది. మీవంటి పెద్దవాళ్లు కూడా వీటిని అభిలషిస్తారంటే ఆశ్చర్యం ఏముందిమీకు. ప్యారీ మిఠాయిలతో జీవితం ఒక ఆటగా గడిచిపోతుంది. వాటిని విడిగా కొనవచ్చు లేదా అందమైన డబ్బాలలో కొనవచ్చు. మీ కుటుంబము అతిధులు మీరూ అందరూ పంచుకోండి.

వీటిని వాడారా. లెమన్ బార్లీ కోకోనట్స్. సూపర్ బట్టర్‌స్కాచ్. మిల్క్ టాఫీ




ప్యారీస్-విశిష్ఠమైన మిఠాయిలను తయారుచేయువారు

ప్యారీస్ కన్ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

JWT/PRS/2785


తప్పక చూడండి!
ఉల్లాస ఉద్రేకాలతో ఉప్పొంగించే
అత్యుత్తమ
సాంఘిక
చిత్రం






SAP
శ్రీనివాస్ ఆర్ట్సు ప్రొడక్షన్సు సమర్పించు
కమలా పిక్చర్సు వారి..
మాంగల్యమే మగువ ధనం
అపరాజిత రిలీజ్
మాటలు-పాటలు అనిసెట్టి • సంగీతం కె.వి. మహదేవన్ & పెండ్యాల శ్రీనివాస్
దర్శకుడు పి.మాధవన్ B.A • నిర్మాతలు టి.ఎస్.శ్రీనివాసన్ B.A - ఎన్.నాగసుబ్రహ్మణ్యం B.A.
SREEKRISHNA PUBLICITIES



మీ దగ్గు
త్వరగా
పోవును



ఛాతీ మరియు
గొంతుగ నొప్పికి

# పెప్స్‌ను

మీరు తీసుకోండి

పెప్స్‌ను చప్పరించి, నొప్పిని నివారించే చర్యను జరుపునట్టి అందలి శమనకరమైన ఆవిరులను పొందండి. అవి గొంతుగ నొప్పి, బ్రోంకైటిస్ దగ్గు మరియు జలుబును గలిగించే క్రిములను చంపుటకు సహాయపడును. పెప్స్ త్వరగా నివారణను గలిగించును.




ఇందులో హానికరమైన
ఓషధులు లేవు.
పిల్లలకు సురక్షితంగా
ఇవ్వవచ్చును.

బ్రోంకైటిస్,
గొంతుగ నొప్పి,
పడిశెము,
అధిక కఫము,
జలుబులు
మరియు దగ్గులను
త్వరగా నివారించును.

FPY-63 TEL

మందుల వ్యాపారులందరివద్ద
అమ్మబడుచున్నది.

సి. ఇ. ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

ఆంధ్రప్రదేశ్ డిస్ట్రిబ్యూటర్లు :

**M/s. వినోద్ అండ్ కో.,**

పోస్టు బాక్సు నం. 148,

హైదరాబాదు - 12.



# అన్ని వంటలకు శ్రేష్ఠమైన నూనెలు




అగ్‌మార్కు కాబడిన
ఎ.యస్. బ్రాండ్
## చాయపప్పు నూనె




అగ్‌మార్కు కాబడిన
మేన్షన్ బ్రాండ్......
## నువ్వుల నూనె

- గోదావరిడెల్టా నువ్వులనుండి ఆరోగ్యకరముగు ప్రత్యేకపద్ధతులతో తయారుకాబడినవి.
- రుచి, రంగు, సువాసనలతో అన్నివంటుపదార్థములను అమితమగురుచివంతముగ చేయును.
- ఊరగాయలను చాలకాలము నిలువయుంచును, ముక్కను మెత్తబడనీయవు, బూజుపట్టనీయవు.
- తలకువాడినయెడల మెదడుకు చలువచేయును. వెంట్రుకలను బాగుగా పెరుగునట్లు చేయును.
- 16,4,2. కి.గ్రా. డబ్బాలలో పేకింగు చేయబడుచున్నవి.

Ramsingh

డిస్ట్రిబ్యూటర్సు :

**M/s.** అశోక్ స్టోర్సు
183, శరత్‌బోస్ రోడ్,
దేశప్రియ పార్కు ఎదురుగా, కలకత్తా - 26

**Mr. N.** సత్యనారాయణ
129/L5 రోడ్ నెం. 11
B. H. ఏరియా, కద్మా, జంషెడ్‌పూరు

**M/s.** యిమ్మిడిశెట్టి రామకృష్ణయ్య సన్సు
బరంపురం : ఫోన్ నెం. 43

MFRS, అంబటి సుబ్బన్న & కో. సామర్లకోట

Life's
sweet...
it's
sweeter
still with









delicious
SATHE
chocolates!

SATHE BISCUIT & CHOCOLATE CO. LTD., POONA-2.

herps'-SBC 178

ఆఫీసులో ప్రతిరోజూ చురుకుగా ఉండటం ముఖ్యం...

# టినోపాల్ అదనపు తెల్లదనం ఇస్తుంది

తెల్ల బట్టలకు మరింత అందం చేకూరుస్తుంది

* ఆఫీస్‌లో బాస్‌కి అతనంటే ఇష్టం.
అతను చురుకైనవాడు.
చూడడానికి కూడా అలాగే ఉంటాడు
చక్కటి తెల్ల బట్టలు ప్రతి రోజూ ధరిస్తాడు—
అందుకు, టినోపాల్ ఉపయోగించే
అతని శ్రీమతికి ధన్యవాదాలు చెప్పాలి!

ఆఖరున జాడించేటప్పుడు మీ తెల్ల బట్టకు కొద్ది టినోపాల్ కలిపితే ఎంతో అద్భుతమైన వ్యత్యాసం కలుగుతుంది—షొక్కాలు, చీరలు, రవికలు, తువ్వాళ్ళు, పిల్లల బట్టలు—అన్నిటికీ అయితే దీనికి ఖర్చెంత? బట్టకు ఒక్క పైసా కూడా కాదు! అందమైన తెల్ల బట్టలకోసం ప్రతి రోజూ టినోపాల్ వాడండి! ప్రతిరోజూ చురుకైన వాళ్ళు ఎన్నుకునేది దీన్నే. టినోపాల్ నూలు బట్టలకైనా, మరే బట్టలకైనా ఏవిధమైన హాని చేయదు. ఎందుకంటే ఇది ఆధునిక సైంటిఫిక్ పద్ధతిలో తెల్ల బట్టలకు అదనపు తెల్లదనం ఇస్తుంది.







టినోపాల్, జె.ఆర్.గైయిగి
ఎస్.ఎ. బాల్, స్విట్జర్లెండ్‌వారి రిజిస్టరు
చేయబడిన ట్రేడ్ మార్కు.

సుహృద్ గైయిగి లిమిటెడ్. పి. ఒ. బాక్స్ 965. బొంబాయి-1.

Shilpi SGT-179 TEL

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ :






నా మనస్సు చివుక్కుమంది. క్రొత్త కంపెనీలో పై పదవి సులభముగా వస్తుంది కనుక నేను ప్రమోషనుమీద బదిలీ త్వరగా అవుతుందని ఆశించేను. ఇంక బదిలీ లేదని నా భార్యతో అంటే ఆమె చాల నిరుత్సాహపడి పోరింపు ప్రారంభించింది. "బాగుంది మీ వరస! ఆఫీసులో పోరింపు చాలదనా నీ ఉద్దేశం" అన్నాను. ఆమె యిలా అంది."బదిలీని గురించి నేను అనడములేదు. మిమ్మల్ని గురించే విచారిస్తున్నాను. ఈ మధ్య మీరు నీర్సముగా, ఏదో ఆలోచిస్తూన్నట్లున్నారు. ఒకపారి డాక్టరు దగ్గరకు వెళ్లండి!"



ఆమె చెప్పిన విషయమూ సబబుగానే ఉంది. పోనీ, అలాగే చేద్దామని మర్నాడు డాక్టరు దగ్గరకు వెళ్లేను. ఆయన యిలా అన్నారు. "కష్టపడి పనిచేస్తున్నారేమో, మీకు ఎక్కువ పోషణ కావాలి. రోజూ హార్లిక్స్ త్రాగండి, చురుకుగా ఉంటారు."



హార్లిక్స్ ఎంత బాగుగా పనిచేసింది! గోధుమపిండి మరియు మాల్టెడ్ బార్లీం పోషణతో కూడిన శ్రేష్ఠమైన డెయిరీ పాలతో తయారైన హార్లిక్స్ నాకు ఎక్కువ శక్తి ఉత్సాహములను కలిగించింది. ఆఫీసులో నా పనిని మెచ్చుకొని నన్ను ప్రమోషనుమీద మా వూరు బదిలీచేసేరు. హార్లిక్స్ చేసిన మేలు మేము ఎన్నటికీ మరచిపోలేము!




# హార్లిక్స అదనపు శక్తిని కలిగించును!

JWT HL 4823

# బ్రిటానియా సమర్పించు 2 ముచ్చటైన ప్రెజెంటెషన్ టిన్నులు

ఇవిగో రంగురంగుల రకరకాల
బ్రిటానియా శ్రేణిలో మరో రెండు
టిన్నులు—'రోజెస్' మరియు 'బూకే.
కరకరలాడే రకరకాల కమ్మని
బ్రిటానియా బిస్కెట్లున్నాయి.
కన్నుల పండువైన యీ
టిన్నులు పండుగపర్వాలలో,
కథలు కార్యాలలో యిచ్చి
పుచ్చుకోతగిన కానుకలు.
అంతేకాదు ఖాళీఅయిపోగానే
ఏమైనా పోసుకోడానికి
పనికివస్తాయి.

## బ్రిటానియా బిస్కట్లు





ఇప్పుడు అంతర్జాతీయ ప్రఖ్యాతి బడసినవి



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

డిసెంబరు "చందమామ"లో "నారదుడి శాపం" అన్న కథ తులసీదాసు రామాయణం లోది. అందులో ప్రహస్తుడి చావు గురించి ఇచ్చిన వివరాలకూ, రంగుల బొమ్మ సీరియల్‌గా వెలువడుతున్న వాల్మీకి రామాయణం లోని వివరాలకూ తేడా ఉన్నది. రామాయణాన్ని వాల్మీకి అనంతరం ఎన్నో వందలమంది రచించారు. వారు తొలి కథలో అనేక మార్పులు చేశారు. ఇప్పుడున్న వాల్మీకి రామాయణ మంతా వాల్మీకి రచన కాదనీ, అందులో ఇతరులు చేర్చినది కొంత ఉన్నదనీ పండితులు కూడా ఒప్పుకుంటున్నారు.

పాఠకులు ఈ విషయాలను జ్ఞాపకం ఉంచుకున్నట్టయితే లేని పోని అనుమానాలకు గురి కావలిసిన అవసరం ఉండదు.

సంపుటి : 36 - ఫిబ్రవరి 1965 - సంచిక : 2

CHITRA



# భారత చరిత్ర



యోధుడుగా కన్న పాలకుడుగా షేర్ షా మరింత గణనీయుడని చెప్పాలి. అతను అయిదేళ్ళే రాజ్యం చేశాడు. కాని ఆ కొద్ది కాలంలోనే అతను ఒక ఆదర్శప్రాయమైన పరిపాలనా వ్యవస్థ నెలకొల్పాడు. "ఈ పఠాను చూపిన వివేకం ఏ ప్రభుత్వమూ – చివరకు బ్రిటిషు ప్రభుత్వం కూడా—ప్రదర్శించ లేదు," అని ఒక పాశ్చాత్య చరిత్రకారు డన్నాడు. భూమి శిస్తు వసూళ్ళూ, రైతుల హక్కులూ, కబులియతులూ, పట్టాలూ మొదలైనవి కలకాలం ప్రామాణికంగా ఉండే టట్టు అతను ఏర్పాట్లు చేశాడు. సుంకాలు విధించటంలో అక్రమాలకు అవకాశం లేకుండా చేశాడు. దేశరక్షణకు గాను అతి నిడుపైన రహదార్లు వేయించాడు. తూర్పు బెంగాలులోని సోనార్‌గాంవ్ నుంచి సింధు నది దాకా అతను వేయించిన 1500 కోసుల నిడివి గల గ్రాండ్ ట్రంక్ రోడ్డు ఇప్పటికీ ఉన్నది. అతను రహదార్ల వెంట హిందూ, ముస్లిము బాటసారులకు సరాయ్‌లు నిర్మించాడు. "బంగారు కాసుల సంచి పక్కన పెట్టుకుని నిర్జనస్థలంలో పడుకున్న వాడికి సైతం" చోరభయం లేకుండా చేశాడు. అతని పాలనలో అందరికీ ఒకే రకం న్యాయం జరిగింది. రాజకుటుంబంవారు కూడా న్యాయ చట్టానికి అతీతులు కారు.

షేర్ షా అనామకుడుగా జన్మించి కూడా కేవలమూ స్వప్రతిభతో పైకి వచ్చి భారత దేశపు అగ్ర చక్రవర్తులలో ఒక డనిపించు కున్నాడు. అక్బరుకు పూర్వం అతనిలాటి ప్రజారక్షకులు లేరు. అక్బరు సాధించిన అనన్య పరిపాలనకు పునాది అతనే వేశాడని చెప్పవచ్చు. షేర్ షా అంత త్వరలో చావ నట్టయితే భారత చరిత్రలో మొగలు యుగ మంటూ ఉండేదే కాదేమో నని ఒక ప్రఖ్యాత చరిత్రకారుడన్నాడు.

## 41. మొగలు సామ్రాజ్య పునఃప్రతిష్ఠ

షేర్ షా తోబాటు అతను పునరుద్ధరించిన అఫ్ఘాన్ సామ్రాజ్యం శిథిలమయింది. అంతః కలహాలూ, అరాజకమూ ప్రబలాయి. షేర్ షా తరవాత అతని కొడుకు సలీమ్‌షా సుల్తానయాడు. అతను కూడా తండ్రిలాగే సమర్థుడు, కాని అతను త్వరలోనే–1554 నవంబరులో—పోయాడు. అతని మైనరు కుమారుణ్ణి అతని మేనమామ అదిల్‌షా చంపించి, తానే సుల్తానయాడు. ఈ అదిల్ షా వ్యర్థుడు. ఇతని హయాంలోనే అఫ్ఘాన్ సామ్రాజ్యం విచ్ఛిన్నం కాసాగింది.

ఇది హుమాయూన్‌కు చాలా లాభించింది. అతను పదిహేనేళ్ళపాటు తల దాచుకునే చోటు లేక సంచార జీవితం గడిపాడు. అతని తమ్ములతని పట్ల ద్రోహులుగా ప్రవర్తించారు. అందరిలోకీ పెద్ద భ్రాతృద్రోహి కామ్రాన్.

హుమాయూన్‌కు అనేకమంది శరణార్థులు పరివారంగా తయారయారు. సింధు రాష్ట్రంలో శిబిరం ఏర్పాటు చేసుకుని, తన సామ్రాజ్యాన్ని తిరిగి గెలుచుకొనటానికి హుమాయూన్ చేసిన ప్రయత్నం ఫలించలేదు. సింధు గవర్నరయిన షా హుసేన్ శత్రుత్వం ఇందుకంతరాయమయింది.



1542 తొలి మాసాలలో హుమాయూన్, సింధు ఎడారిలో సంచారం చేస్తున్న కాలంలోనే, హమీదా బాను బేగమును పెళ్ళాడాడు. ఆమె షేక్ అలీ అంబర్ జైనీ కుమార్తె. హుమాయూన్‌కు రాజపుత్ర రాజులు ఆశ్రయం ఇవ్వటానికి జంకారు. అతను అమర కోట వెళ్ళాడు. అక్కడి రాజు పేరు రాణాప్రసాద్. ఠట్టా, హక్కర్ రాజ్యాలు గెలవటానికి హుమాయూన్‌కు తోడ్పడతానని మాట ఇచ్చి, రాణాప్రసాద్ చివరకు ఏమీ చెయ్యలేదు.

1542 నవంబరు 23న అమరకోటలోనే అక్బరు పుట్టాడు.

భారత దేశంలో తనకు సహాయం పుట్టదని రూఢి చేసుకుని హుమాయూన్ పర్షియాకు వెళ్ళి, అక్కడి రాజైన షా తహమాస్ప్ సహాయం అర్థించాడు. హుమాయూన్ షియా మతం పుచ్చుకునేటట్టూ, అతను విజయం పొందాక కందహర్‌ను తన వశం చేసేటట్టూ షరతులు పెట్టి, పర్షియా రాజు హుమాయూన్‌కు 14,000 సేన నిచ్చాడు.

తన తండ్రి లాగే హుమాయూన్ కూడా పర్షియా సహాయంతోనే భారత దేశాన్ని జయించవలసి వచ్చింది.

1545 లో కందహర్, కాబూలులు హుమాయూన్ వశమయాయి. అయితే అతను కందహర్‌ను పర్షియనుల వశం చెయ్యలేదు; కందహర్ కారణంగా మొగలులకూ, పర్షియనులకూ కొంత ఘర్షణ సాగిందికూడా. కామ్రాన్‌ను ఖైదీగా పట్టుకుని, గుడ్డివాణ్ణి చేసి మక్కాకు పంపేశారు. ఇలా చేయటానికి హుమాయూన్ ఒకంతట ఒప్పుకోలేదు. అస్కరీని కూడా మక్కాకే పంపేశారు. హిందాల్ అనేవాడు మాత్రం దొమ్మిలో చచ్చాడు.

1555 నవంబరులో హుమాయూన్ హిందూస్తానాన్ని తిరిగి జయించటానికి బయలుదేరాడు. 1555 ఫిబ్రవరిలో లాహోరూ, జులైలో ఢిల్లీ, ఆగ్రాలూ హుమాయూన్ వశమయాయి. అతను తన అసమర్థతతో కోల్పోయిన రాజ్యంలో కొంత భాగం తిరిగి జయించుకోగలిగాడు.

తాను పడిన కష్టాల ద్వారా హుమాయూన్ మనస్తత్వం ఏ మాత్రం మారిందో తెలుసుకునేటందుకు అవకాశం లేకపోయింది. 1556 జనవరి 24న అతను ఢిల్లీలో తన లైబ్రరీ మెట్ల మీద నుంచి ప్రమాద వశాన జారిపడి మరణించాడు. ఫిబ్రవరి 14 న, పదమూడేళ్ళ వయసులో ఉన్న అక్బరును సుల్తానుగా ప్రకటించారు.



# నేహ్రూ కథ

## 8



బ్రిటిషు అధికారులు ప్రకటించిన సంస్కరణలు కాంగ్రెసుకూ, ముస్లిం లీగుకూ కూడా అసంతృప్తి కలిగించాయి. ఈ సంస్కరణలను గురించి చర్చించటానికి బొంబాయిలో, 1918 ఆగస్టులో ఏర్పాటుచేసిన ప్రత్యేక కాంగ్రెసు సమావేశానికి మితవాదు లెవరూ రాలేదు. ఈ సంస్కరణలను ఆమోదించినవారు కాంగ్రెసు నుంచి చీలిపోయి వేరే సంస్థను ఏర్పాటు చేసుకున్నారు.

ఈ సంస్కరణలే అంతంత మాత్రంగా ఉంటే కాకతాళీయంగా మరొకటి జరిగింది. దేశంలో జాతీయోద్యమం రెచ్చిపోతున్న కారణంచేత, రాజకీయ నేరస్థుల విచారణ వగైరాలను ఎలా జరపాలో సూచించమని ప్రభుత్వం ఒక కమిటీని వేసి, దానికి న్యాయమూర్తి రౌలట్‌ను అధ్యక్షుడుగా నియమించింది. రౌలట్ నివేదిక సరిగా ఈ తరుణంలోనే విడుదల అయింది. రౌలట్ సూచనలు దారుణంగా ఉన్నాయి. వాటి ఆధారం పైన రెండు చట్టాలు కూడా తయారుచేశారు. ఈ చట్టాలు 1919 ఫిబ్రవరిలో, యుద్ధం ముగిసిన మూడు మాసాలకు ప్రకటించబడ్డాయి.

దేశంలో గొప్ప సంచలనం రేగింది. వీటితోనే గాంధీజీ భారత రాజకీయరంగంలో ప్రముఖ పాత్ర వహించాడు. మోతీలాల్ కూడా వీటితో తన మితవాదాన్ని మరికొంత విసర్జించాడు. ప్రభుత్వం సంస్కరణలు ప్రకటించినప్పుడు మోతీలాల్ కొంత సుముఖత కనబరిచాడు, జవాహర్ తండ్రితో తీవ్రంగా భేదించాడు. కాని రౌలట్ చట్టాల విషయంలో వారి కేమీ తేడా లేకపోయింది.

"ఇప్పుడేం చెయ్యాలి?" అని కాంగ్రెసు సభ్యు లడిగారు.



"చెయ్యటమా? అవి శాసనరూపం పొందగానే సత్యాగ్రహం ప్రారంభిస్తాం," అన్నాడు గాంధీజీ.

అయితే గాంధీజీ తొందరపడలేదు. ఆ చట్టాలను ఉపసంహరించమని వైస్రాయికి విజ్ఞప్తి చేసుకున్నాడు. వైస్రాయి గాంధీజీ సూచనను నిరాకరించాడు. గాంధీజీ అనారోగ్యంగా ఉండి కూడా "సత్యాగ్రహ సభ"కు సభ్యులను చేర్చ నారంభించాడు. సత్యాగ్రహ సభ్యులు రౌలట్ చట్టాలను ఉల్లంఘించి, స్వచ్ఛందంగా జైళ్ళకు పోతారు. అదీ గాంధీజీ నిర్ణయించిన సత్యాగ్రహ కార్యక్రమం!

ఈ కార్యక్రమం జవాహరుకు ఎంత ఉత్సాహం కలిగించిందో మోతీలాలుకు అంత నిరుత్సాహం కలిగించింది. ఆయనకు జైళ్ళలో కూర్చోవటంలో నమ్మకం లేదు. జవాహరు ఉత్సాహంతో జైలుకు పోతాడని ఆయన గ్రహించి, గాంధీజీని తక్షణం అలహాబాదుకు రావలిసిందిగా కబురు చేశాడు. గాంధీజీ వచ్చాడు. ఆయనా, మోతీలాలూ ఏకాంతంగా మాట్లాడుకున్న మీదట, గాంధీజీ జవాహరుతో, "తొందరపడి ఏమీ చెయ్యవద్దు. మీ నాన్నగారిని ఊదర పెట్టి, ఆయనకు మనఃక్లేశం కలిగించవద్దు," అని బోధించాడు.

రౌలట్ బిల్లును శాసనం చేసితీరాలని వైస్రాయి పట్టు బట్టాడు. అందుకు నిరసనగా ఒక్క రోజు హర్తాలు జరపవలసిందని గాంధీజీ దేశానికి పిలుపిచ్చాడు. మార్చి 30 సత్యాగ్రహ దినంగా మొదట ప్రకటించబడింది, కాని తదుపరి దాన్ని ఏప్రిలు 6 కు మార్చారు. ఆ రోజు తన రాష్ట్రంలో విజయవంతం కావటానికి జవాహర్ తన సర్వశక్తులూ ధారపోశాడు. సత్యాగ్రహ దినం అంత విజయవంత మవుతుందని కాంగ్రెసు అనుకోలేదు. ప్రభుత్వమూ అనుకోలేదు. భారతీయుల మనస్తత్వ

రహస్యం తన కెంత బాగా తెలుసునో గాంధీజీ తొలిసారిగా స్పష్టం చేశాడు. ఢిల్లీ లోని విదేశీ ప్రభువులకు తారెత్తిపోయింది. దేశమంతటా ఉద్యమం చిన్న చిన్న అల లుగా ప్రారంభమై, చిన్న అలలు పెద్ద కెరటాలై, మొత్తం మీద బ్రహ్మాండమైన ఉప్పెనగా పరిణమించింది.

సత్యాగ్రహ దినం వాయిదా పడిన సంగతి ఏ కారణంచేతనో ఢిల్లీకి చేరలేదు. ఢిల్లీ పౌరులు మార్చి 30 నే సత్యాగ్రహ దినం జరిపారు. చాందినీ చౌకులో హిందూ ముస్లిము లేకమై పర పరిపాలకుల పట్ల తమ ఆక్షేపణ వ్యక్తం చేశారు. దుకాణా లన్నీ మూసేశారు. ఔరంగజేబు ప్రార్థనలు చేసిన జుమ్మా మసీదులో ఒక అపూర్వ సన్నివేశం జరిగింది—స్వామి శ్రద్ధానంద అనే హిందూ సన్యాసి అక్కడ సమావేశ మైన ముస్లిములకు ఉపన్యాసం ఇచ్చాడు! దీనితో బ్రిటిషు అధికారులు బేజారెత్తిపోయి, సైనికుల సహాయంతో సమావేశా లన్నిటినీ విచ్ఛిన్నం చేసి, కాల్పులు కూడా జరిపించారు.

ఏప్రిలు 6 న దేశమంతటా జరిగిన సత్యాగ్రహమప్పుడు కూడా అనేక ప్రాంతాల పోలీసులూ, సైనికులూ కాల్పులు



జరిపారు. పంజాబులో కొన్ని చోట్ల—ప్రత్యేకించి లాహోరు, అమృతసర్లలో—జనం ఎదురు దెబ్బ తీసి, గృహ దహనాలూ, కొట్లాటలూ, తెల్లవారి పై దాడులూ జరిపారు.

బొంబాయి నుంచి ఢిల్లీకి వెళుతూ గాంధీజీ ఏప్రిలు 8 న అరెస్టయాడు. అయితే ఆయనను బొంబాయికి తీసుకు వచ్చి, ఏప్రిలు 10 న విడుదల చేసేశారు. ఆయన అరెస్టయిన వార్త మాత్రం బొంబాయి, అహమ్మదాబాదు నగరాలలో చాలా కల్లోలాలు రేపింది.

ఏప్రిలు 15 న పంజాబులో మార్షల్ లా అమలులోకి వచ్చింది. జనరల్ డైయర్

జలియన్‌వాలా బాగ్‌లో దారుణ హత్యా కాండ జరిపించాడు. జూన్ 9 న మార్షల్ లా ఉపసంహరించ బడేదాకా పంజాబు ప్రజలు అనేక దారుణాలకు గురి అయారు. 1857 తరవాత బ్రిటిషు పాలకుల పట్ల భారతీయులలో అంతటి ద్వేషాగ్ని ఏనాడూ ప్రజ్వలించి ఉండలేదు.

చిత్రమేమిటంటే ఇన్ని దారుణ పరిణామాలకు మూల కారణమైన రౌలట్ శాసనాలు ఒక్క సందర్భంలో కూడా అమలు జరగలేదు.

పంజాబు దురంతాలను గురించి బ్రిటను లోని ప్రభుత్వం విచారణ జరిపించక తప్పలేదు. లార్డ్ హంటర్ నాయకత్వాన నలుగురు బ్రిటిషువారూ, నలుగురు భారతీయులూ కలిసి విచారణ జరిపి రెండు నివేదికలు తయారు చేశారు. రెండు నివేదికలూ జనరల్ డైయర్‌ను అభిశంసించాయి. జనరల్ డైయర్‌ను సైనిక శాఖ నుంచి బర్తరఫ్ చేసి ఇంగ్లాండు పంపారు. అక్కడ అతని "ప్రతాపానికి" కొందరు ఒక బంగారు కత్తిని కూడా బహూకరించారు! భారతీయుల ద్వేషాగ్ని చల్లారలేదు.

ఈ సంఘటనల ఫలితంగా మోతీలాల్ కూడా గాంధీ, జవాహర్ల దారిలోకి వచ్చేశాడు. ఆ తరవాత ఆయన ఒక్క అడుగు కూడా వెనక్కు వెయ్యకుండా స్వాతంత్ర్య యోధుల అగ్రశ్రేణిలోనే ఉండిపోయాడు. మోతీలాల్‌కు ప్రజోద్యమాల పట్ల ఏమీ ఆసక్తి లేదు. ప్రజా బాహుళ్యానికి ప్రతినిధిగా తన ఏకైక పుత్రుడు జవాహర్ కళ్ళ ఎదుట ఉండటమే ఆయనను స్వాతంత్ర్య యోధుణ్ణిగా చేసిందనటానికి సందేహం లేదు. దానికి తోడుగా, ప్రతి ఒక్కరి మనస్తత్వాన్నీ మంత్ర ముగ్ధం చెయ్యగల గాంధీజీ ప్రభావం కూడా ఆయన పైన పడింది.






# 9

[మందారణ దుర్గం పఠానుల వశమైనప్పుడు యుద్ధం చేస్తూ తీవ్రంగా గాయపడిన యువ రాజు జగతసింహుణ్ణి పఠాను సేనానాయకుడైన ఉస్మాన్ ఖాన్ పఠానులకు నవాబైన కతలూ ఖాన్ రాజభవనానికి చేర్చి, అతనికి చికిత్స చేయించాడు. నవాబు కుమార్తె అయిన ఆయషా అతనికి శ్రద్ధగా సేవ చేసి ప్రాణం నిలబడేటట్టు చేసింది. అతను కోలుకున్న నాడే కతలూ ఖాన్, వీరేంద్రసింహుణ్ణి విచారించి, మరణ దండన విధించాడు.]

నవాబు సైగ చేయగానే సిపాయిలు వీరేంద్ర సింహుణ్ణి వధ్య భూమికి తీసుకుపోయారు. అక్కడికి వెళ్ళే దారిలో ఒక ముసల్మాను వాడు వీరేంద్రసింహుడి చెవిలో ఏదో చెప్పాడు. కాని అది అతనికి అర్థం కాలేదు. అప్పుడా ముసల్మాను వాడాయన చేతిలో ఒక చీటీ ఉంచాడు. వీరేంద్రసింహుడు ధ్యాస ఎక్కడో ఉంచి చీటీ విప్పి చూశాడు. అది విమల రాసిన ఉత్తరం. వెంటనే అతను ఆగ్రహావేశంతో దాన్ని నలిపి, దూరంగా విసిరేశాడు.

చీటీ తెచ్చినవాడు దాన్ని ఏరి తీసుకుని, అక్కడి సిపాయీలతో, "నేను తిరిగి వచ్చినదాకా ఆగండి," అన్నాడు.

"చిత్తం," అన్నారు సిపాయీలు.

ఎందుకంటే ఆ చీటీ తెచ్చిన ముసల్మాను వాడు ఉస్మాన్ ఖానే; సిపాయీలు అతని ఆజ్ఞను పాలించి తీరాలి.

బంకించంద్ర చట్టోపాధ్యాయ



ఉస్మాన్ ఖాన్ ఆ ఉత్తరం తీసుకుని అంతఃపుర ప్రాంగణం ప్రవేశించాడు. ఒక చెట్టు కింద విమల మేలిముసుగు కప్పుకుని నిలబడి ఉన్నది. అత నామెను సమీపించి, చుట్టూ ఒకసారి కలయ చూసి, ఆమెకు జరిగిన దంతా చెప్పాడు.

"మీకు చాలా శ్రమ ఇస్తున్నాను. అయితే మీ మూలానే మాకీ దుర్దశ సంప్రాప్త మయింది. మీరు నా పని నెరవేర్చక తప్పదు," అన్నది విమల.

"అమ్మా, మీ రడుగుతున్నది ఎంత ప్రమాదంతో కూడిన విషయమో మీకు తెలీదు. ఈ సంగతి ఏవిధంగా నైనా కతలూ ఖాన్‌కు తెలిసిన పక్షంలో నాకు మరణ శిక్ష పడినా పడవచ్చు," అన్నాడు ఉస్మాన్ ఖాన్.

"కతలూ ఖానా? ఎందుకు నాతో అబద్ధాలాడతావు? నీ వంటి పై చెయ్యి వెయ్యటానికి కతలూ ఖాన్‌కు గుండె లున్నాయా?" అన్నది విమల.

"కతలూ ఖాన్ సంగతి మీకేమీ తెలీదు. సరే, ఏమయితే అదవుతుంది. పదండి, మిమ్మల్ని వధ్య భూమి దగ్గిరికి చేరుస్తాను," అన్నాడు ఉస్మాన్ ఖాన్.

ఇద్దరూ వధ్యభూమి చేరుకున్నారు. ఉస్మాన్ ఖాన్ వెనకనే నడుస్తూ విమల వీరేంద్రసింహుడి వద్దకు వచ్చింది. అప్పుడు వీరేంద్రసింహుడు భిక్షుక వేషంలో ఉన్న అభిరామస్వామి తో మాట్లాడుతున్నాడు: "గురుదేవా, ఇక నాకు సెలవివ్వండి. ఇంక నేను మీకు చెప్పేదేమున్నదీ? ఈ జన్మలో నాకు ఏమీ అవసరం లేదు. ఎందుకు? ఎవరి కోసం?"

అభిరామస్వామి మేలిముసుగు ధరించిన విమల కేసి సైగ చేశాడు. వీరేంద్రసింహుడామె దిక్కు చూడగానే, విమల తన మేలి ముసుగు తీసేసి, దూరంగా విసిరి, వీరేంద్ర సింహుడి కాళ్ళ పైన పడిపోయింది.

వీరేంద్రసింహుడు, "విమలా!" అన్నాడు ఆశ్చర్యంతో.

విమల ఉన్మాదిని లాగా అయిపోయి, గొంతు చించుకుంటూ, "స్వామీ! ప్రభూ! ప్రాణేశ్వరా! ఈ నాడు లోకానికి నిజం చెప్పేస్తాను. నన్నెవ రడ్డుతారు? ప్రాణ నాథా! నా ప్రాణమా! ఇవాళ మీరేమై పోనున్నారు? మా భారం ఎవరి పైన వేసి వెళుతున్నారు?" అన్నది.

వీరేంద్రసింహుడి కళ్ళ నుంచి అశ్రువులు జలజలా రాలాయి. "విమలా! ప్రియా! ఈ సమయంలో నా కెందుకు కన్నీరు తెప్పిస్తావు? శత్రువులు చూస్తే, నేను చావుకు వెరిచి ఏడుస్తున్నా నను కుంటారు," అన్నా డాయన.

విమల మాట్లాడ లేదు.

"విమలా, నేను పోతున్నాను. మీరు కూడా రండి," అన్నాడు వీరేంద్రసింహుడు.

విమల అతని చెవిలో రహస్యంగా, "వస్తాను. ముందీ సైతాను పై పగ తీర్చుకుని మరీ వస్తాను," అన్నది.

వీరేంద్రసింహుడి ముఖం విప్పారింది. "నీకు చాతనవుతుందా?" అన్నాడు.

విమల తన కుడి చెయ్యి చూపుతూ, "ఇదే చెయ్యి! దీని నుంచి అలంకారాలు



తీసేసి, ఈ చేతిలోనే లోహపు అలంకారాలు ధరించి, దీని రక్త దాహం తీరుస్తాను," అంటూ తన చేతి కంకణాలు తీసి దూరంగా పారేసింది.

"నీ నిశ్చయం నెరవేరుగాక! జగదీశ్వరుడు నీ కోరిక తీర్చుగాక!" అన్నాడు వీరేంద్రసింహుడు. ఇంతలో తలారివాడతన్ని తొందర చేశాడు.

"ఇక నీవు వెళ్ళు," అన్నాడు వీరేంద్రసింహుడు విమలతో.

"వెళ్ళను. నా వైధవ్యప్రాప్తిని కళ్ళారా చూస్తాను. మీ రక్తమే నాకు మార్గదర్శకం కావాలి," అన్నది విమల.



తలారి కత్తి పైకెత్తటం ఆమె చూసింది. అంతలోనే ఆమె కళ్ళు వాటంతటవే మూత బడిపోయాయి. తిరిగి ఆమె కళ్ళు తెరిచి చూసేసరికి వీరేంద్రసింహుడి తల శరీరం నుంచి వేరైపోయి నేలపై దొర్లుతున్నది.

విమల శిలా ప్రతిమలాగా, కొంచమైనా చలనం లేకుండా, కంట ఏ మాత్రం తడి లేకుండా, తన భర్తయొక్క శిరస్సును తదేక దృష్టితో చూస్తూ నిలబడిపోయింది.

* * *

విధివిలాసం విచిత్రమైనది. తిలోత్తమా, విమలా కూడా ఇప్పుడు కతలూఖాన్ ఉంపుడుగత్తె లుండే భవనంలో ఉంటు న్నారు. ఒక కోటగాని, గ్రామంగాని తనకు లొంగిపోయినప్పుడు అక్కడి అందగత్తె లెవరైనా చిక్కితే వారిని నవాబు సేవకు ప్రత్యేకించాలని నియమం. అందుచేత తిలోత్తమా, విమలా నవాబు విలాస భవనానికి చేర్చబడ్డారు. అయితే, ఇద్దరూ చెరొక చోట ఉండిపోయారు. తిలోత్తమ గతి ఏమైనదీ కూడా విమలకు తెలియరాలేదు. విమల అయితే తన భవిష్యత్తు తాను నిర్ణయించుకున్నది, కాని తిలోత్తమను కనిపెట్టి ఉండేటందుకు విమల తప్ప మరెవరూ లేరు. అందుచేత ఆమె ఒంటరిదైపోయింది.

విమల ఉస్మాన్‌ఖాన్ రాక కెదురు చూస్తూ కూర్చుని ఉన్నది.

ఉస్మాన్‌ఖాన్ పఠానులలో మణిపూస లాటివాడు. యుద్ధం అతని వృత్తి, అతని ధర్మం. యుద్ధంలో అతను ఎలాటి పని చెయ్యటానికీ సంకోచించడు. కాని యుద్ధంలో విజయం చేకూరినాక ఓడిపోయిన వారిపై అత్యాచారాలు చెయ్యటమనేది అతని కేమాత్రమూ గిట్టదు.

విమలా తిలోత్తమల పై కతలూఖాన్ పాపిష్టి కళ్ళు పడకపోయినట్టయితే, ఉస్మాన్‌ఖాన్ దయచేత వారిప్పుడు స్వతంత్రలై ఉందురు. అతని దయచేతనే విమల



వీరేంద్రసింహుణ్ణి ఆఖరు క్షణంలో కలుసుకో గలిగింది.

ఉస్మాన్‌ఖాన్ కతలూఖాన్‌కు అన్న కొడుకు. అందుచేత అతను రాజమహలులోకి చిత్తం వచ్చినట్టు వచ్చి పోవటానికి అధికారం ఉన్నది. కాని నవాబు విలాస గృహంలోకి వెళ్ళే హక్కు ఎవరికీ లేదు; ఉస్మాన్‌కు కూడా లేదు.

విమల ఎలాగో ఒక దాసి ద్వారా ఉస్మాన్‌కొక చీటీ పంపింది. దాన్ని చదువుకుని ఉస్మాన్ దాసీతో, "నే నక్కడికి రావటం మా ఇద్దరికీ ముప్పు. అందుచేత ఆమెనే ఇక్కడికి రమ్మను," అన్నాడు.

దాసీ ఈ మాట తనతో చెప్పగా విమల, "నే నక్కడికెలా వెళ్ళగలను ?" అన్నది.

"దానికి తగిన ఏర్పాటు ఆయనే చేస్తానన్నారు," అన్నది దాసి.

ఆ సాయంకాలం ఆయుషా దాసి ఒకతె వచ్చి అంతఃపుర రక్షకులైన కొజ్జాలతో ఏదో మాట్లాడింది. తరవాత ఆమె వచ్చి విమలను తన వెంట పిలుచుకుపోయింది.

"నా వల్ల ఇంకేమైనా సహాయం కావలసి ఉన్నదా ?" అని ఉస్మాన్ విమల నడిగాడు.

"పెద్ద సహాయమేమీ అవసరంలేదు. యువరాజు జగతసింహుడు జీవించి




ఉన్నాడా ? ఆ సంగతి చెప్పండి చాలు," అన్నది విమల.

"జీవించే ఉన్నాడు."

"స్వతంత్రుడా ? ఖైదీయా ?"

"నిశ్చయంగా ఖైదీయే. కాని ప్రస్తుతం జైలులో మాత్రం లేడు. అతనికి చికిత్స జరుగుతున్నది. మంచానపడి ఉన్నాడు. కతలూఖాన్‌కు తెలియకుండా నే నతన్ని నా భవనంలోనే ఉంచాను. చికిత్సా, ఉపచారాలూ చక్కగా జరుగుతున్నాయి."

"అభాగినులమైన మా మూలానే, పాపం అతనికీ దుర్దశ సంభవించింది. కాని విధి నిర్ణయాన్ని ఎలా తప్పించటం ? నా దొక







చిన్న మనవి: ఈ ఉత్తరాన్ని అతనికి చేర్చ గలరా? ఇంతకు మించి నేను మిమ్మల్ని ఏమీ కోరబోను."

విమల ఇచ్చిన ఉత్తరాన్ని ఉస్మాన్ ఆమెకే తిరిగి ఇస్తూ, "ఇది నేను చెయ్యరాని పని. రాజకుమారుడు ఏలాటి స్థితిలో ఉన్నప్పటికీ అతను ఖైదీగానే పరిగణించబడతాడు. మేము ముందుగా చదివి, అందులో హాని ఏమీ లేదనుకున్న మీదటనే ఏ ఉత్తరాలైనా ఖైదీలకు చేరుతాయి," అన్నాడు.

"మీకు హానికరంగా ఉండే అంశమేమీ ఈ ఉత్తరంలో లేదు. అందుచేత ఇదేమీ చేయరాని పని కాదు. కాకపోయినా మీకు మీరే ప్రభువు? నాకూ డా మీరే ప్రభువు," అన్నది విమల.

"ఇతర విషయాలలో అయితే నేను నవాబు ఆజ్ఞలకు విరుద్ధంగా అప్పుడప్పుడు వ్యవహరిస్తూనే ఉంటాను, కాని ఈ విషయంలో అదెంత మాత్రమూ సాధ్యం కాదు," అన్నాడు ఉస్మాన్‌ఖాన్.

"అయితే మీ రా ఉత్తరాన్ని చదువుకొని మరీ పంపండి," అన్నది విమల.

ఉస్మాన్‌ఖాన్ దాన్ని ఈ విధంగా చదువుకున్నాడు:

"యువరాజా, నేను తమకు ఒకనాడు నన్ను గురించి తెలుపుకుంటానని లోగడ మాట ఇచ్చి ఉన్నాను. ఇప్పు డారోజు వచ్చింది. మా తిలోత్తమ అంబరు సింహాసనం ఆరోహించిన సమయంలో నా సంగతి చెప్పుదామనుకున్నాను. ఇప్పుడా ఆశ కాస్తా అడుగంటి పోయింది. మరి కొన్ని రోజుల అనంతరం భూమి మీద తిలోత్తమ అనే వ్యక్తీ, విమల అనే వ్యక్తీ లేరన్న సమాచారం కూడా మీకు చేరితే చేరవచ్చు. అందుచేత ఇప్పుడే మీకీ లేఖ వ్రాస్తున్నాను. నేను పాపిని. చెయ్యరాని పనులెన్నో నా జీవితంలో అనేకం చేశాను. అందుచేత

నాకు ఈ లోకంలో కీర్తి ప్రతిష్ఠలంటూ ఏమీవుండవు.

"రాజకుమారా, ఈ జన్మలోనే నేను మీ పరిజనంలో ఒకదాన్ని కాగలనని ఒకప్పుడు భావించాను. కాని నావంటి అభాగినుల దౌర్భాగ్యం అగ్నిహోత్రంలాగా, మా మేలు కోరి మా సమీపానికి వచ్చిన వారిని కూడా దహించి వేయగలదు. ఈ దాసి దొక ప్రార్థన: ప్రజలు నన్ను దాసీ వేషం వేసుకున్న కులట అనీ, వేశ్య అనీ అన్నప్పుడు, 'విమల నీచ జాతిది, అభాగిని, నోటి దురుసు వల్ల అపరాధాలు చేసినది. అంతేగాని ఆమె కులట కాదు, జారిణి కాదు,' అని చెప్పండి. ఈ నాడు స్వర్గస్థులై పోయినవారు విమల అదృష్టం కొద్దీ ఆమెను శాస్త్రోక్తంగా వివాహం చేసుకున్నారు. విమల ఒక్క క్షణం పాటు కూడా ఆయన పట్ల అతిచరించలేదు.

"అయితే నేను వీరేంద్రసింహుడి ఇంట ఏ కారణంచేత దాసిగా మసులుకుంటూ వచ్చానో ఆ వృత్తాంతం కూడా సంగ్రహంగా చెబుతాను, వినండి.

"మందారణ దుర్గానికి సమీపంలోని ఒక గ్రామంలో జయధరసింహుడనే ఆయన పరిచారికలలో భర్తకు దూరమైన అపురూప




సుందరి ఒకతె ఉండేది. ఆమె భర్త సైనికుడు, ఎప్పుడూ దూరప్రాంతంలో ఉండేవాడు. శశిశేఖరుడనే బ్రాహ్మణ యువకుడి కన్ను ఆమె పైన పడింది. ఆమె ఆ యువకుడి వలలో పడి, కొద్ది రోజులకు గర్భవతి అయింది. ఈ సంగతి తెలిసి శశిశేఖరుణ్ణి అతడి తండ్రి ఇల్లు వెళ్ళగొట్టాడు. శశిశేఖరుడు కాశీకి వెళ్ళి అక్కడ విద్యాధ్యయనం చేయసాగాడు. అక్కడ కూడా ఆయన స్వభావం మారలేదు. కాశీలో ఒక శూద్ర స్త్రీ ఆయన వల్ల గర్భవతి అయింది. ఆ సంగతి ఏమని వివరించి చెప్పను. ఆ శూద్ర స్త్రీ గర్భాన జనించిన దాన్ని నేనే!

"కొంత కాలమయాక శశిశేఖరుడు మా అమ్మను విడిచిపెట్టేసి ఎటో వెళ్ళి పోయాడు. మా అమ్మ అతి కష్టంతో నన్ను పెంచుతూ వచ్చింది. నే నారేళ్ళ దాన్నయి ఉండగా, చలి రోజుల్లో, ఒక పఠాను తన భార్యతోనూ, కొడుకుతోనూ కాశీ మీదుగా ఢిల్లీ వెళుతూ, కాశీలో హిందువు లెవ్వరూ ఆ రాత్రి బస యివ్వనందున, మా గుడిసెలో ఆ రాత్రికి ఆశ్రయం అర్థించాడు. మా అమ్మ సరే నన్నది. ఆ కాలంలో కాశీలో పిల్లల దొంగతనాలు విరివిగా జరిగే విట. ఆ రాత్రి ఒక దొంగ మా యింటికి కన్నం వేసి లోపలికి వచ్చి, పఠాను కొడుకును సంగ్రహించాడట. ఆ సమయంలో నేను అంతా చూసి గట్టిగా కేకలు పెట్టానట. పఠాను భార్య లేచి చూస్తే పక్కలో పిల్ల వాడు లేడు. దొంగ పిల్లవాడితోసహా మంచం కింద దాక్కున్నాడు. పఠాను వాణ్ణి జుట్టు పట్టుకుని బయటి కీడ్చి, వాడి చేతిలోని పిల్లవాణ్ణి లాగేసుకుని, దొంగ చెవి ఒకటి కోసేసి, వాణ్ణి పోనిచ్చాడట. ఇదంతా నాకు జ్ఞాపకం లేదు; మా అమ్మ చెప్పింది."

ఇంత వరకు చదివి ఉస్మాన్ ఖాన్ కొంచెం సేపు ఏదో ఆలోచించి, విమలతో, "నీ కప్పుడు మరొక పేరేదైనా ఉండేదా?" అని అడిగాడు.

"ఉండేది. కాని అది ముసల్మానుల పేరు కావటంచేత మా నాన్న దాన్ని తీసేసి విమల అనే పేరు పెట్టాడు," అన్నది విమల.

"ముందుండిన పేరేమిటి? మాహరూయేనా?"

విమల ఆశ్చర్యపడి, "మీ కెలా తెలిసింది?" అన్నది.

"ఈ ఉత్తరంలో నీవు చెప్పే పఠాను కొడుకును నేనే!" అన్నాడు ఉస్మాన్ ఖాన్.

విమల నిర్ఘాంతపోయింది.

—(ఇంకా వుంది)






# సిద్ధుడిచ్చిన పండు

విసుగు చెందని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు తలపెట్టిన ఈ కార్యం మంచిదో చెడ్డదో నాకు తెలియదు గాని, ఒక్కొక్కసారి చెడ్డ పని చేయటానికి కూడా ధర్మ సందేహం అడ్డు తగులుతుంది. అందుకు తార్కాణంగా నీకు సిద్ధవరదుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు:

పూర్వం భార్గవ శర్మ అనే ధనిక బ్రాహ్మణు డుండేవాడు. ఆయన భార్య పేరు నాగవేణి. వారికి చాలా ఏళ్ళుగా సంతాన ప్రాప్తి లేకపోయింది. తన కిన్ని నీళ్ళు వదిలి, పుంనామ నరకం నుంచి రక్షించే కొడుకు లేనందుకు భార్గవశర్మ, తన గొడ్రాలితనం పోగొట్టి, తనకు




అనందం చేకూర్చేటందు కొక సలుసు లేనందుకు నాగవేణీ ఎంతో చింతించారు.

ఇలా ఉండగా ఒక నాడు ఒక సిద్ధుడు వారుండే నగరం గుండా వెళుతూ భార్గవశర్మ కంట పడ్డాడు. అప్పుడు భార్గవశర్మ ఆ సిద్ధుడికి తన స్థితి తెలుపుకుని తనకు సంతాన యోగం ఉందేమో చూడమన్నాడు.

సిద్ధు డాయన చెయ్యి చూసి, "నాయనా, సంతానం కోసం ఎందు కలమటిస్తావు ? నీకీ జన్మకు సంతాన ప్రాప్తి లేదు. దాన ధర్మాలు చేస్తూ ఈ జీవితం హాయిగా గడిపెయ్యి," అని చెప్పాడు.

"స్వామీ, ఘటనా ఘటన సమర్థులైన మీ బోటి వారు తలుచుకుంటే జాతకాలు కూడా మారిపోతాయి. నా కొక్క కొడుకు కలిగే మార్గం చెప్పాలి," అన్నాడు భార్గవశర్మ.

సిద్ధుడు సరేనని ఒక మామిడి పండు తెప్పించి, దాన్ని మంత్రించి భార్గవశర్మ కిచ్చి, "దీన్ని భుజించిన వారికి సకల సద్గుణ సమన్వితుడైన కొడుకు కలుగుతాడు. నీ భార్యను శుచి అయి దీన్ని అరగించ మని చెప్పు," అని చెప్పి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

భార్గవశర్మ పరమానంద భరితుడై ఆ పండును ఇంటికి తెచ్చి, తన భార్య కిచ్చి, "ఇది తింటే సుపుత్రుడు పుడతా డట. ఒక సిద్ధు డిచ్చాడు. దీన్ని రేపు ఉదయం స్నానం చేసి తిను," అని చెప్పాడు.

భార్గవశర్మ తన భార్య కీ మాట చెప్పేటప్పుడు పొరుగింటి ముత్తయిదువ అదిలక్ష్మి అనే ఆమె వారింటికి వస్తూ అంతా విన్నది.

భర్త ఇచ్చిన మామిడి పండును నాగవేణి దేవుడి మందిరంలో పెట్టటం కూడా ఆమె చూసింది. తరవాత అదిలక్ష్మి తాను వచ్చిన పని ముగించుకుని వెళ్ళి

పోయింది. ఆమె వెళ్ళిపోయే టప్పుడు దేవుడి మందిరంలో ఉన్న పండు కాస్తా తీసి దాచుకొని మరీ వెళ్ళింది.

ఆదిలక్ష్మి పండును దొంగిలించటానికి కారణమేమిటంటే, ఆమెకు వరసగా ఏడుగు రాడ పిల్లలు పుట్టారు. మగబిడ్డను ఎత్తుకోవాలన్న కోరిక ఆమెకు తీరనేలేదు. ఆ మామిడిపండు తింటే సుపుత్రుడు పుడతాడని భార్గవశర్మ తన భార్యతో అనటం ఆమె వినటం చేత, ఆ సుపుత్రుణ్ణి తానే కనాలన్న అభిలాషకొద్దీ ఆమె పండును దొంగిలించింది. ఆమె ఇంటికి వెళ్ళుతూనే శుచిగా స్నానం చేసి, ఆ రాత్రే రెండో కంటి వాడికి తెలియకుండా పండు తినేసింది.

నాగవేణి మర్నాటి ఉదయం స్నానం చేసి, పండు తిందామని దేవుడి మందిరం లోకి వస్తే పండు లేదు. ఎంత వెతికినా అది కనిపించ లేదు. పండు పోయిందన్న దిగులుకు భర్త ఏమై పోతాడో నన్న దిగులు జత అయింది. ఎంతో కష్టపడి తెచ్చిన ఆ పండు పోయిందంటే భార్గవశర్మ గుండె లవిసి చచ్చిపోవచ్చు కూడా. అందుచేత నాగవేణి భర్తతో పండు తినేసినట్టు చెప్పింది.

నాగవేణి కష్టా లంతటితో తీరకపోగా, అప్పుడే ఆరంభ మయాయి. సిద్ధు డిచ్చిన




మామిడిపండు తిన్నాక గర్భవతిగా ఉండాలి, గర్భవతి అయిన మనిషి కనాలి. కొద్ది కాలం పోనిచ్చి నాగవేణి తాను గర్భవతిగా ఉన్నట్టు లోకానికి ప్రకటించింది. ఆమె బంధు వర్గ మంతా ఎంతో సంతోషించారు. చాలా దూర ప్రాంతం నుంచి ఆమె చెల్లెలు భాగీరథి అనే ఆమె అక్కను చూడ వచ్చింది.

భాగీరథి మూడు నెలల గర్భిణి అని నాగవేణికి తెలిసింది. ఆమె తన చెల్లెలితో తనకు ఏర్పడ్డ సమస్య ఏమిటో రహస్యంగా చెప్పి, "నే నీ చిక్కు నుంచి బయట పడాలంటే నీకు పుట్టబోయే బిడ్డను




నాకిచ్చెయ్యాలి. అదికూడా ఏంతో గోప్యంగా జరగాలి," అన్నది.

"నా భర్త ఒప్పుకుంటే నాకేమీ అభ్యంతరం లేదు," అన్నది భాగీరథి.

భాగీరథి తన గ్రామానికి బయలుదేరేటప్పుడు నాగవేణి కూడా ఆమె వెంట ప్రయాణమయి, తన భర్తతో, "కనమెయ్యటం ఏమిటో తెలిసిన దాన్ని కాను. నా కిక్కడ ఉండటానికి భయంగా ఉన్నది. అనేక పురుళ్ళు పోసుకున్న నా చెల్లెలి వెంటనే ఉండి, ప్రసవం కాగానే బిడ్డతో సహా తిరిగి వస్తాను," అన్నది. అందుకు భార్గవశర్మ సమ్మతించాడు.

భాగీరథి నలుగురు పిల్లల తల్లి. ఆమెకు ఆడ పిల్లలూ, మగ పిల్లలూ కూడా ఉన్నారు. అయితే ఆమె భర్త దుర్వ్యసనాలు గల నీచుడు. అతనికి ఖర్చు జాస్తి. తన భార్యకు పుట్టబోయే బిడ్డను తన వదినెగారు కోరే పక్షంలో ఆమె తన ఒంటిమీది నగలన్నీ ఇవ్వవలసి ఉంటుందన్నాడు. విధిలేక నాగవేణి ఒప్పుకున్నది.

భాగీరథి సకాలంలో ప్రసవించింది. నాగవేణికి అనుకూలంగా ఆమె మగబిడ్డనే కన్నది. పురుడు చాలా రహస్యంగా జరిగింది. నాగవేణి ఆ బిడ్డనూ, తన చెల్లెలినీ కూడా తన వెంట తీసుకుని తమ ఊరికి ప్రయాణమయింది. ఆమె ఒంటి పైన గల నగలన్నీ భాగీరథి భర్త తీసుకున్నాడు.

తన భార్య ఇంత కాలానికి, సిద్ధుడి దయ వల్ల, ఒక మగ పిల్లవాణ్ణి కని ఇంటికి తిరిగి వచ్చినందుకు భార్గవశర్మ సంతోషించాడు. ఆయన తన కొడుక్కు సిద్ధవరదుడు అని పేరు పెట్టుకున్నాడు. భార్య ఒంటి మీద ఒక్క నగ కూడా లేకపోవటం చూసి ఆయన అడిగితే నాగవేణి తాను నగలన్నీ తీసి ఒక చోట మూట గట్టి తలంటు పోసుకుంటూంటే దొంగ ఎత్తుకు పోయా రన్నది. దాని విషయం ఆయన

అంతగా పట్టించుకోలేదు. వరదుడు భాగీరథి పాలు తాగుతూ పెరగసాగాడు.

మామిడిపండు తిన్న ఫలితంగా పొరుగింటి ఆదిలక్ష్మికి కూడా ఒక కొడుకు పుట్టాడు. వాడికి మాధవుడని పేరు పెట్టారు.

వరదుడూ, మాధవుడూ కలిసే పెరిగారు కాని వాళ్ళ మనస్తత్వాలలో ఏమీ పోలిక లేదు. ఆ వ్యత్యాసం రాను రాను హెచ్చయింది. మాధవుడు తెలివితేటలూ, వివేకమూ, వినయమూ, సద్వర్తనా కలవాడు. వరదుడు మూర్ఖుడు, గడుగ్గాయి; వాడు దుష్టుడుగా తయారయే లక్షణాలు క్రమంగా బయట పడ్డాయి. భార్గవశర్మకు సిద్ధుడు చెప్పిన సద్గుణాలు పొరుగింటి మాధవుడిలో కనపడ్డాయి గానీ, తన కొడుకు వరదుడిలో కనిపించలేదు. వరదుడు ఇంటి దొంగతనాలతో ప్రారంభించి ఊళ్ళో దొంగతనాలకు ఎగబడ్డాడు. తండ్రి వాణ్ణి సరి చేయ యత్నించిన కొద్దీ వాడి బుద్ధి మరింత వక్రించింది. చివరకు వాడు ఇల్లు విడిచి ఒక తక్కువ జాతి స్త్రీ ఇంట చేరాడు.

కొంత కాలమయాక వరదుడు జబ్బు పడ్డాడు. వాణ్ణి వాడి స్త్రీ వెళ్ళగొట్టింది. కొద్ది రోజులపాటు వాడు అడవులూ, లోయలూ పట్టి తిరిగి అకాల మరణం



పొంది, తీరని కోరికలతో చనిపోయిన కారణంగా పిశాచ మయాడు.

వాడు కొత్తగా పిశాచం కావటం చేత ఇతర పిశాచాలు వాణ్ణి తమ నాయకుడి దగ్గిరికి తీసుకుపోయారు. పిశాచాల నాయకుడు వాణ్ణి చూసి, "నువ్విలా పిశాచం కావటం అచ్చగా నీ తప్పు కాదు. అందుకు అసలైన కారకు లెవరో వారిని పట్టి పీడించు," అన్నాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, పిశాచమైన వరదుడు ఎవరిని పట్టి పీడించాలి? ధనాశ చేత తన కన్న కొడుకును తన అక్క కిచ్చేసిన భాగీరథినా? తన కొడుకని చెప్పకుంటూ వాణ్ణి పెంచి పెద్ద చేసిన నాగవేణినా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల బద్దలైపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వరదుడు పిశాచం కావటానికి భాగీరథి కారకురాలు కాదు. ఆమె తన కొడుకును సిరి సంపదలు గల చోట దత్తు ఇచ్చింది. అందులో తప్పేమీ లేదు. పసి తనంలో పాలిచ్చి వాణ్ణి పెంచి తన మాతృ ధర్మం కూడా నెరవేర్చుకున్నది. వరదుడు తన ఇంటి వాతావరణంలో పెరగక ధనికుల ఇంట పెరగటం వల్లనే అనేక కోరికలతో చచ్చి పిశాచ మయినాడు. నాగవేణి పెంపకమే వాణ్ణి అలా చేసింది. కాని తప్పు నాగవేణిది కూడా కాదు. తన భర్త ఎంతో ఆశతో తెచ్చిన పండు పోయిందంటే తన భర్త ప్రాణా లెగిరిపోతా యన్న భయంతో ఆమె వరదుణ్ణి పెంచింది. వరదుడు పిశాచం కావటానికి మూల కారణం ఆది లక్ష్మి మామిడి పండును దొంగిలించటం. పిశాచం ఆమెనే పట్టాలి," అన్నాడు.

రాజు కీ విధంగా మౌన భంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)






# మంత్రపు చెవి

జపాను దేశంలో ఒక యువకు డుండే వాడు. ఆతను ఒక నాడు సముద్ర తీరాన నడుస్తూ ఉండగా ఇసుకలో ఒక మడుగులో ఒక చేప తన్నుకుంటూ ఉండటం కన పడింది. అది సముద్రపు పోటులో ఒడ్డుకు కొట్టుకు వచ్చి ఆ మడుగులో చిక్కుకుని, తిరిగి సముద్రంలోకి వెళ్ళలేకపోయింది.

యువకు డా చేపను చూసి జాలిపడి, దాన్ని ఎత్తుకుపోయి సముద్ర జలంలో వది లేసి, ఒక ప్రాణికి సహాయపడ్డాను గదా అన్న సంతోషంతో వెళ్ళిపోతూండగా వెనక నుంచి ఎవరో, "కొంచం అగు!" అని కేక పెట్టారు.

అతను వెనక్కు తిరిగి చూసే సరికి ఎవరో స్త్రీ కనిపించింది. అత నామె నెన్నడూ చూసి ఉండని కారణం చేత ఆమె పిలుస్తున్నది తనను కాదనుకుని అతను మళ్ళీ తన దారి పట్టాడు.

"నిన్నే! కొంచెం ఆగు!" అని ఆ స్త్రీ మళ్ళీ పిలిచింది.

అతను ఆశ్చర్యపడుతూ ఆగి ఆమె వద్దకు తిరిగి వెళ్ళాడు.

"సముద్ర రాజు నన్ను పంపాడు. ఆయన ఏక పుత్రిక ప్రాణాలను నీవు కాపా డావు. మా దేశానికి నిన్ను వెంటబెట్టుకు పోవటానికి నన్ను పంపారు. దయచేసి నా వెంట రా," అన్న దామె.

"నాకు ఈదటం రాదు. సముద్ర రాజ్యాని కెలా రాగలను?" అన్నాడు యువకుడు.

"ఆ భయం నీకు వద్దు. నేను వాస్త వంగా చేపనే. నా వీపు మీద ఎక్కావంటే నిన్నక్కడికి ఏ ప్రమాదం జరక్కుండా తీసుకుపోతాను," అన్న దామె.

ఇద్దరూ కలిసి మోకాలు లోతు నీటిలోకి వెళ్ళాక ఆ ఆడ ఘనిషి పెద్ద చేపగా మారి

జి. ఉమాకాంత్



పోయింది. యువకు డామె వీపు పైన ఎక్కాడు. సముద్ర రాజుండే చోటికి వెళ్ళే దారిలో ఆ చేప యువకుడితో, "సముద్ర రాజు ని న్నేదైనా వరం కోరమంటే మంత్రపు చెవి తప్ప మరేమీ అక్కర్లేదని చెప్పు. తన కూతురి ప్రాణం కాపాడావన్న కృతజ్ఞత కొద్దీ దాన్ని ఆయన నీ కిస్తాడు. దాన్ని చెవిలో పెట్టుకుని ఆలకిస్తే అన్ని ప్రాణుల భాషలూ నీకు బాగా అర్థమవుతాయి," అన్నది.

సముద్ర రాజు యువకుడికి గొప్పగా ఆతిథ్యం జరిపాడు. నృత్య గానాలు జరిగాయి. యువకుడు సముద్ర రాజు అతిథిగా కొన్నాళ్ళుండి, ఇంక తన ఇంటికి వెళ్ళిపోతా నన్నాడు. అప్పుడు సముద్ర రాజు, "మా లోకం నుంచి నీ కిష్టమైనది కోరు, బహుమానంగా ఇస్తాను," అన్నాడు.

"నాకు మంత్రపు చెవి తప్ప మరేమీ వద్దు," అన్నాడు యువకుడు.

"సముద్రంలో అలాటిది ఒకే ఒకటి ఉన్నది. అయినప్పటికీ నీవు కోరావు గనక దాన్ని నీ కిస్తాను," అంటూ ఒక గూట్లో వున్న మంత్రపు చెవిని యువకుడి కిచ్చేశాడు. అతన్ని సముద్ర రాజ్యానికి తెచ్చిన చేపే అతన్ని ఒడ్డుకు చేర్చి పోయింది.

యువకుడు సముద్రం ఒడ్డున ఒంటరిగా కూర్చుని ఉండగా కొన్ని పిచ్చుకలు కిచకిచలాడుతుండటం అతనికి వినపడింది. అవి ఏమంటున్నాయో తెలుసుకోవాలని కుతూహలం కలిగి, బుల్లి శంఖం లాగా ఉన్న మంత్రపు చెవిని తన చెవులో పెట్టుకున్నాడు. వెంటనే అతనికి పిచ్చుకలంటున్నది అర్థమయింది.

"మనుషులు మహా తెలివిగల వాళ్ళమనుకుంటారు. కాని వాళ్ళ కేమీ తెలీదు. ఈ పక్కనే ఉన్న వాగు మధ్యలో జనం కాలు వేసి దాటి పోయే రాయి అచ్చమైన బంగారం. ఆ సంగతి ఒక్కడికీ తెలీదు,"

అంటూ పిచ్చుకలు తమలో తాము నవ్వు కుంటున్నాయి.

ఈ సంగతి విని యువకుడికి మితి లేని ఆశ్చర్యం కలిగింది. అతను వాగు వద్దకు వెళ్ళి, దాని మధ్యలో ఉన్న రాతిని ఎత్తి, దాని పైన పేరుకుని ఉన్న పాచిని కడిగే సరికి తళతళా మెరుస్తూ బంగారం బయట పడింది. పిచ్చుకలు అన్న మాటలో అసత్యం ఏమీ లేదు.

యువకుడా బంగారాన్ని జేబులో పెట్టు కుని, తన అదృష్టానికి ఆశ్చర్యపడుతూ ఇంటికి పోతూ ండగా రెండు కాకులు, "కా, కా," అని అరవటం వినిపించింది. అతను మంత్రపు చెవిని తీసి తిరిగి తన చెవిలో పెట్టుకుని కాకులు చేస్తున్న సంభాషణ విన్నాడు.

"మనుషులు వట్టి మూర్ఖులు. ఎక్కడెక్కడి వైద్యులనూ పిలిపించారు, కాని ఒక్కడు కూడా జమీందారుగారి పిల్లకు నయం చెయ్యలేకపోయారు. ఎలా నయం చేస్తారూ? అది మందులతోనూ మాకుల తోనూ నయమయే వ్యాధి అయితేగద? జమీందారుగారి ఇల్లు తిరగ వేసేటప్పుడు, గడ్డితో బాటు ప్రమాదవశాన ఒక పాము కూడా కట్టులో చిక్కుకుపోయింది. అది తిండికి మాడి కృశించి పోతున్నది. దాన్ని



ఎవరైనా విడిపించి ఆహారం పెడితేనేగాని జమీందారుగారి కూతురు వ్యాధి నుంచి కోలుకోదు," అంటూ కాకులు తమలో తాము మాట్లాడు కున్నాయి.

ఈ మాటలు తన చెవిన పడటం మేలయిందనుకుని యువకుడు తిన్నగా జమీందారింటికి వెళ్ళాడు.

"నా కుమార్తెకు చికిత్స చేసి, వ్యాధి నయంచేసిన వారికి కోరినది ఇవ్వబడును," అని ఇంటి బయట రాసి ఉన్నది.

యువకుడు లోపల ప్రవేశించి, "జబ్బుగా ఉన్న అమ్మాయికి చికిత్స చేస్తాను," అన్నాడు.

అక్కడ చేరి ఉన్న వైద్యులంతా విరగబడి నవ్వి, "మనందరికీ అంతుచిక్కని వ్యాధిని ఈ మడ్డి వెధవ నయం చేస్తాట్ట!" అని యద్దేవా చేశారు. కాని జమీందారు మాత్రం ఎవరు వైద్యం చేస్తామన్నా చేయించటానికి సిద్ధంగానే ఉన్నాడు.

యువకుడు లోపలికి వెళ్ళి రోగిని చూసి, "ఇది రోగం కాదు, శాపం. జీవహింస జరిగింది. ఇంటి కప్పులో పాము బంధించబడి ఉన్నది," అన్నాడు.

జమీందారు తన నౌకర్లను పిలిపించి కప్పు విప్పించాడు. పాము ఒక కట్టలో కనిపించింది. అది తిండికి మాడి కొనప్రాణంతో ఉన్నది. దాన్ని కట్ట నుంచి ఊడదీసి తెచ్చి పాలు పోశారు. అది పాలు తాగి బలం వచ్చి కదిలి పాకసాగింది. అది ఒక అడుగు పాకే సరికి, మంచంలో జమీందారు కూతురు లేచి కూర్చున్నది; పాము రెండడుగుల దూరం పాకే సరికి పిల్ల లేచి నిలబడింది. పాము తన దారిన ఎటో వెళ్ళిపోయింది. దానితోనే జమీందారు కూతురి వ్యాధి కూడా పోయింది.

తన కూతురికి చికిత్స చేసినందుకు బహుమానంగా జమీందారు యువకుడికి ఆ పిల్లనే ఇచ్చి పెళ్ళి చేశాడు.






# శరీరం విలువ

ఉదయగిరి రాజు ఉదయసేనుడు గొప్ప ధర్మాత్ముడు. అతను తన రాజ్యంలో అన్ని వృత్తుల వారికీ సుఖంగా జీవితం సాగేటట్టు అనేక ఏర్పాట్లు చేశాడు. అందరికీ పనులు కల్పించాడు. ఎవరు గానీ కటిక దారిద్ర్యం అనుభవించ నవసరం లేకుండా చేశాడు. రాజు ఇలా చేయటం చేత దేశంలో యాచన అన్నది చాలా భాగం తగ్గిపోయింది. ఏ పనీ చేసుకో లేని ముసలివాళ్ళూ, వికలాంగులూ బిచ్చమెత్తి ఏదో విధంగా కాలక్షేపం చేసుకునే వాళ్ళు.

ఆ దేశపు బిచ్చగాళ్ళలో ఒక యువకుడుండేవాడు. వాడు బుద్ధి ఎరిగినప్పటి నుంచీ బిచ్చగాడి వృత్తిలోనే బతుకుతూ వస్తున్నాడు. దేశంలో బిచ్చగాళ్ళకు ప్రోత్సాహం క్రమంగా తగ్గిపోతూ ఉన్నందు వల్ల వాడికి తన వృత్తి అంత కంతకూ కష్టతరం కాసాగింది.

చివర కొక నాడు ఉదయం మొదలు మధ్యాన్నం దాకా వాడి కెవరూ బిచ్చం పెట్టలేదు. ఆకలి దహించుకుపోతూ రాజ వీధిన ఒక చెట్టు కింద కూర్చుని వాడు దారే పొయ్యే వాళ్ళందరినీ యాచించ సాగాడు. ఎవరూ వాడి కేసి చూడలేదు. భగవంతుణ్ణి ధ్యానిస్తే నైనా ప్రజలకు దయ కలుగుతుందేమోనని వాడు గొంతెత్తి,

"ఓ పరాత్పరా, పేదవాడి కింత ముష్టి! ఆపద్రక్షకా, కడుపు కాలే వాడి కొక కబలం! దయామయా, దౌర్భాగ్యుడి కింత ధర్మం!" అని కేకలు పెట్ట సాగాడు.

అప్పటికీ ఎవరూ వినిపించుకోలేదు. అరిచి, అరిచి అసలే ఆకలిగా ఉన్న వాడికి శోష కూడా రాసాగింది. వాడికి దేవుడి పైన కోపం వచ్చింది.

"ఓరి భగవంతుడా, ఎక్కడ చచ్చావురా? పుట్టించిన వాడు పెట్టించడా అంటారే,

ఏ. క్రిష్ణమూర్తి

పుట్టించిన వాడివి పెట్టించవేంరా, నీ అమ్మ కడుపు కాలా!" అంటూ వాడు నోటికి వచ్చి నట్టు తిట్టసాగాడు.

ఆ సమయంలో రాజుగారు గుర్రం మీద రాజ వీధి వెంట వెళుతూ బిచ్చగాడి మాటలు ఆలకించి, గుర్రాన్ని ఆపి, దిగి, వాడి వద్దకు పోయి, "ఎవర్నిరా అలా తిట్టి పోస్తున్నావు?" అని అడిగాడు.

"ఇంకెవర్ని? పాపాల భైరవుడు ఆ భగ వంతుణ్ణే!" అన్నాడు బిచ్చగాడు.

"భగవంతుణ్ణి పూజించాలి గాని ఎవ రైనా తిడతారా? భగవంతుడు నీ కేం ద్రోహం చేశాడు?" అన్నాడు రాజు.

"ఇంకేం చెయ్యాలి? పొద్దున లేచి నప్పటి నుంచీ కూడు లేదు. ఎంత సేపు ముష్టెత్తినా చిన్న కాసైనా దొరక్క పోయె!" అన్నాడు బిచ్చగాడు.

"ఒరే నీకు డబ్బు కావాలంటే నే నిస్తాను. నే నీ దేశానికి రాజును. నీ చెయ్యి ఒకటి ఇచ్చెయ్యి. వెయ్యి రూపాయలిస్తాను. లేదా కా లొకటి ఇయ్యి. రెండు వేలిస్తాను. నీ కళ్ళిచ్చావంటే అర్ధ రాజ్యం ఇస్తాను," అన్నాడు రాజు.

"నీ డబ్బు నా కొద్దు. నే నేమీ ఇవ్వను," అన్నాడు బిచ్చగాడు.

"అంటే నువ్వు చాలా భాగ్యవంతుడ వన్నమాట! నీకు వెయ్యి రూపాయల కంటె విలువైన చెయ్యీ, రెండు వేల కన్న విలువైన కాలూ, అర్ధ రాజ్యం కన్న ఎక్కువైన కళ్ళూ ఉన్నా యన్నమాట! అవి ఇచ్చి నందుకు దేవుణ్ణి పూజించక తిడతా వేమిరా, పశువా? పో, దేవుడిచ్చిన విలువైన కాళ్ళూ, చేతులూ ఉపయోగించి పొట్ట పోసుకో, బిచ్చ మెత్తకు!" అని వాణ్ణి మందలించి రాజు వెళ్ళిపోయాడు.

అది మొదలు వాడు వీధుల వెంట బిచ్చ మెత్తటం మాని శరీర శ్రమ చేసి బతకటం నేర్చుకున్నాడు.





# మూఢ శాసనం

ఆరావళీ పర్వతాలలో ఒక చిన్న రాజ్యం ఉండేది. దాన్ని పాలించే రాజు ఒక శాసనం చేశాడు. అరవై ఏళ్ళు నిండిన వాళ్ళు ఏ పనికీ పనికిరారు గనుక వారిని పోషించటం వృథా అనీ, అలాటి వారిని రాజ్యంలో లేకుండా చేస్తే మిగిలిన వాళ్ళు మరింత సుఖంగా బతుకుతారనీ అనుకుని, అరవై నిండిన వృద్ధులను వారి కొడుకులు దూరాన ఉండే లోయలోని అరణ్యంలో విడిచిపెట్టి రావాలని శాసనం చేశాడు.

రాజ శాసనం అమలు చేయక తప్పదు గనక షష్టి పూర్తి అయిన వారి నందరినీ వారి కొడుకులు ఒక లోయలో వదిలి పెడుతూ వచ్చారు. ఆ లోయకు షష్టిపూర్తి లోయ అనే పేరు వచ్చింది. ఆ ముసలి వాళ్ళు ఆ లోయలో కొంత కాలం ఎలాగో ప్రాణాలు నిలుపుకుని ఆ తరవాత దిక్కు లేని చావు చచ్చేవాళ్ళు.

ఒక ముసలి వాడికి అరవై నిండాయి. శాసనం ప్రకారం ముసలివాణ్ణి ఆయన కొడుకు మెడల మీద మోసుకుని లోయలో వదిలిపెట్టటానికి బయలుదేరాడు. వాళ్ళు మామూలు మార్గాలు దాటి అరణ్య మార్గం ప్రవేశించగానే, పైన ఉన్న ముసలివాడు తన చేతికి అందిన కొమ్మల మండలను విరిచి కింద పారెయ్యసాగాడు.

"ఎందు కలా చేస్తున్నావు, నాన్నా? దారి గుర్తు పెట్టుకుని మళ్ళీ తిరిగి వద్దామనా?" అని కొడుకు అడిగాడు.

"కాదురా, బాబూ. నువు తిరిగి వెళ్ళే టప్పుడు దారి తప్పుతావేమో నని," అన్నాడు తండ్రి.

తన పైన అంత ప్రేమగల తండ్రిని లోయలో వదిలి రావటానికి కొడుక్కు మన సొప్పలేదు. వాడు అర్ధ రాత్రి దాటిన మీదట తండ్రిని యింటికి మోసు కొచ్చి,

బి. రాజగోపాలరావు

అటక పైన దాచి, ఎవరికీ తెలియకుండా కాపాడుతూ వచ్చాడు.

రాజుగారు చేసిన మూఢ శాసనం ప్రజలకు చాలా కంటకింపుగా ఉన్నది. అరవై దాటిన తండ్రులు లేని వాళ్ళు కూడా ఆ శాసనాన్ని అసహ్యించుకున్నారు. అది గమనించి మంత్రి రాజుతో, "మహారాజా, మీరు చేసిన షష్టిపూర్తి శాసనం వల్ల దేశానికి ఆర్థికంగా ఎంత మేలు కలిగిందో తెలీదు గాని, జ్ఞానమూ, అనుభవమూ గల వాళ్ళందరూ అకాల మృత్యువు వాత పడుతూంటే యువకులను సరి అయిన దారిలో నడిపించే వాళ్ళు లేకుండా పోతున్నారు. అందుచేత దేశానికి భరించరాని నష్టం కలుగుతున్నది," అన్నాడు.

రాజు ఈ మాట నమ్మలేదు. తాను చెప్పినది నిజమని రుజువు చేస్తానన్నాడు మంత్రి. ఆయన సలహాతో రాజు చాటింపు వేయించాడు: రాజ్యం లోని పౌరులందరూ బూడిదతో పేనిన తాళ్ళు పట్టుకురావాలి.

బూడిదని తాడుగా పేనటం ఎలాగో పౌరులలో ఒక్కడికి కూడా అర్థం కాలేదు. తండ్రిని అటక మీద దాచినవాడు, "నాన్నా బూడిదతో పేనిన తాళ్ళు పట్టుకు రమ్మని రాజుగారు చాటింపు వేయించారు. అది ఎలా సాధ్యం?" అని అడిగాడు.



"తాడును కాల్చి బూడిద రూపు తెప్పించి అలాగే పట్టుకు పోయి రాజుగారికి చూపరా, బాబూ!" అని తండ్రి కొడుక్కు సలహా ఇచ్చాడు.

వాడు తండ్రి చెప్పిన ప్రకారమే తాడును కాల్చి పట్టుకుపోయి రాజుగారికి చూపాడు.

రాజ్యంలో మరెవరూ ఆ పని చెయ్య లేక పోయారు.

"భేష్, నువు చాలా తెలివైనవాడివి!" అని రాజుగారు మెచ్చుకుని ఆ యువకుణ్ణి పంపేసి, మంత్రితో, "చూశావా? తెలివి తేటలు ముసలి వాళ్ళకే కాదు, యువకులకూ ఉంటాయి," అన్నాడు.

"తెలివితేటలు కుర్రాడి వవునో కాదో తేల్చుకోవడానికి ఇంకొక్క చాటింపు వేయించండి," అని మంత్రి పౌరులకు మరొక పరీక్ష పెట్టాడు.

"దేశంలో ఉన్న పౌరు లందరూ శంఖం మొనలో నుంచి దారం దూర్చి రాజుగారికి తెచ్చి చూపాలి," అని చాటింపు జరిగింది.

అది ఎలా సాధ్యమో ఎవరికీ అర్థం కాలేదు. తండ్రిని దాచిన యువకుడు మళ్ళీ తండ్రినే సలహా అడిగాడు.

"నాయనా, ఒక చిన్న బియ్యపు గింజకు సన్నని దారం కట్టి ఒక చీమకు అందించి, శంఖంలోకి పంపించు. అది మొనలో ఉన్న



బెజ్జం వెంబడి గింజతో సహా బయటికి వస్తుంది. బియ్యంగింజ వెంట దారంకూడా వస్తుంది. గింజను దారం నుంచి ఊడదీసి శంఖాన్ని తీసుకుపోయి రాజుగారికి చూపించు," అన్నాడు తండ్రి.

యువకుడు తండ్రి చెప్పినట్టే చేసి, శంఖాన్ని దారంతో సహా తీసుకుపోయి రాజుకు చూపించాడు. వాడు తప్ప మరెవరూ శంఖాలకు దారం ఎక్కించి తీసుకురాలేదు. రాజు యువకుణ్ణి చూసి పరమానంద భరితుడయాడు.

"మీరు కొంచెం ఉండండి, మహారాజా! వీడే బూడిద తాడు కూడా తెచ్చినవాడు. యుక్తిగల పనులు రెండూ వీడు తన స్వబుద్ధితో చేశాడని నేను నమ్మను," అన్నాడు మంత్రి.

మంత్రి గద్దించి, నిజం చెప్పకపోతే దండించగలనని అన్న మీదట యువకుడు నిజం చెప్పేశాడు.

"మహాప్రభూ, మా నాన్న చాలా తెలివైనవాడు. నన్ను ప్రాణంలాగా చూసుకునేవాడు. కాని ఆయనకు అరవై ఏళ్ళు నిండగానే రాజశాసనాన్నిబట్టి షష్టిపూర్తి లోయలో వదిలిపెట్టటానికి తీసుకుపోయాను. తిరిగి వచ్చేటప్పుడు నేను దారి తప్పిపోతానేమోనని ఆయన అరణ్యమార్గం పొడుగునా నాకోసం చెట్లకొమ్మలు విరిచిపడేశాడు. అది చూసి నేనాయనను లోయలో వదిలిపెట్టలేక ఇంటికి తెచ్చి కాపాడుతున్నాను. ఆయన సలహాపైనే నేను బూడిదతో పేనిన తాడు తెచ్చి తమకు చూపాను. శంఖంలోకి దారం ఎక్కించే మార్గం చెప్పినది కూడా ఆయనే," అన్నాడు యువకుడు.

ఈ మాటలు వినగానే రాజుకు జ్ఞానోదయ మయింది. ఆయన తన శాసనాన్ని ఉపసంహరించుకున్నాడు. అది మొదలు షష్టిపూర్తి అన్నది పునర్జన్మగా భావించబడి ఉత్సవంగా జరపబడుతున్నది.





# అదృష్ట మూర్ఖులు

ఒకప్పుడు ఉజ్జయినీనగర రాజు చనిపోగా అయన కొడుకు మేధావంతు డనే వాడు పట్టాభిషేకం చేయించుకుని రాజయాడు. అతను పేరుకు మాత్రమే మేధావంతుడు, తెలివితేటలకు వట్టి చవట.

అతనికి సుబుద్ధి అనే బాల్యమిత్రు డొక డుండేవాడు. వాడు కూడా పేరుకు తగ్గ వాడు కాడు, ఎందుకంటే వాడికి కొంచెం కూడా బుద్ధిలేదు.

మేధావంతుడి పట్టపురాణి మాత్రం పేరుకు తగ్గది. అమె పేరు సందేహి; అమె కన్నీ సందేహాలే.

చచ్చిపోయిన రాజుగారికి సమర్థుడైన మంత్రి ఒక డుండేవాడు. అయన పేరు గుణపాలుడు. మేధావంతుడి పట్టాభిషేకం జరగగానే, ఇక రాజ్యానికి రానున్నవి మంచి రోజులు కావనీ, సత్సంప్రదాయాలన్నీ పెద్ద రాజుగారితోనే పోయాయనీ గ్రహించి, గుణపాలుడు తన మంత్రి పదవికి రాజీనామా పెట్టి, ఎక్కడో దూరంగా అరణ్యంలో ఆశ్రమం ఒకటి నిర్మించుకుని అందులో దైవధ్యానం చేసుకుంటూ నిశ్చింతగా ఉండిపోయాడు.

గుణపాలుడు వెళ్ళిపోవటం మేధావంతుడికి కూడా సుఖంగానే ఉన్నది. గుణపాలుడు మంత్రిగా ఉంటే అతనికి స్వేచ్ఛ లేదు. అందుచేత తన బాల్యమిత్రుడైన సుబుద్ధిని మంత్రిగా పెట్టుకుని, మేధావంతుడు ఇష్టం వచ్చినట్టు రాజ్యం చెయ్యసాగాడు. రాజూ, మంత్రీ కలిసి చేసే పనులన్నీ సభికులకు వేళాకోళంగా ఉండేవి, వాళ్ళ తెలివితక్కువ తనం చూసి చాటుగా నవ్వుకునే వారు.

ఒకరోజు మేధావంతు డింటికి వచ్చేసరికి భార్య సందేహి ఒక సందేహంతో భర్తకు ఎదురయింది.

చెన్నమాధవరాజు ఆనందరాజు



"ఏమండీ, మూర్ఖులంటే ఎవరు? వాళ్ళెలా ఉంటారు? మీరు సభకు వెళ్ళిన సమయంలో ఎవరో "మూర్ఖుడా!" అనీ, "మూర్ఖురాలా!" అనీ తిట్టుకోవటం విని పించింది," అన్నది సందేహి.

"మూర్ఖు డన్నమాట నేను చాలాసార్లు విన్నానుగాని, మూర్ఖులెలా ఉంటారో. చూడ లేదు. ఈ విషయం సుబుద్ధి నడిగితే చెబు తాడులే," అన్నాడు మేధావంతుడు.

మర్నాడు సభలో సుబుద్ధిని చూడగానే మేధావంతుడికి సందేహి అడిగిన సందేహం జ్ఞాపకం వచ్చింది. అతను సుబుద్ధితో, "మహామంత్రీ, మూర్ఖులనబడే వారు ఎలా ఉంటారు? నాకు తెలుసుకోవాలని ఉంది, చెప్పు," అన్నాడు.

"మహారాజా, మూర్ఖుడూ, మూర్ఖురాలూ అనే మాటలను నేను కూడా విన్నానేగాని అలాటి వాళ్ళను ఎన్నడూ చూడలేదు," అన్నాడు సుబుద్ధి.

"సరే అయితే, నీకు వారం రోజుల వ్యవధి ఇచ్చాను. ఈలోపుగా నీ యిష్టం వచ్చిన చోటికిపోయి అయిదుగురు మూర్ఖు లను పట్టుకు రా. వారెలా ఉంటారో మేమందరమూ చూడాలి. గడువు లోపుగా అయిదుగురు మూర్ఖులనూ తెచ్చి దర్బా రులో హాజరు పెట్టలేకపోయావో నీ తల తీయించి కోటగుమ్మానికి కట్టిస్తాను," అన్నాడు మేధావంతుడు.

సుబుద్ధి ఈ మాట విని బెదిరిపోయాడు. మూర్ఖులెలా ఉంటారో, ఎక్కడ ఉంటారో అతనికి తెలీదు. అందుచేత వారి కోసం ఎక్కడ వెతకాలో కూడా తెలీదు. వెనకటి మంత్రి గుణపాలుడైతే ఇటువంటి పనిని అవలీలగా చేసి ఉండేవాడు.

గుణపాలుడు జ్ఞాపకం వచ్చేసరికి సుబుద్ధికి ప్రాణం లేచివచ్చినట్టయింది. అతను వెంటనే ప్రయాణమై, వేసవి ఎండ లను కూడా లక్ష్యపెట్టకుండా గుణపాలు

డుండే ఆశ్రమం చేరుకుని, గుణపాలుడికి సంగతంతా నివేదించి, " ఈ అయిదుగురు మూర్ఖులనూ వెతికి ఇచ్చే పని మీ వల్లనే జరగాలి. లేకపోతే నా పీక తెగిపోతుంది," అని కాళ్ళపైన పడ్డాడు.

"ఫరవాలేదులే, నాయనా. నేను కూడా నీ వెంట నగరానికి వస్తాను పద. మనకు కావలిసిన మూర్ఖులు దారిలోనే దొరికే అవకాశం వున్నది," అంటూ గుణపాలుడు, సుబుద్ధిని వెంటబెట్టుకుని రాజధానికి బయలుదేరాడు.

వాళ్ళు ఒక గ్రామం చేరేసరికి అక్కడ ఒక ఇల్లు ఒక పక్క అంటుకుని తగలబడుతున్నది. ఇల్లుగలవాడు పదిమందినీ పిలిచి మంట లార్పటానికి బదులుగా, ఇంటి రెండోపక్క కప్పు మీద ఇంత చమురు పోసి అంటిస్తున్నాడు.

గుణపాలు డతన్ని చూసి, " ఇల్లొక పక్క తగలబడుతుంటే మంటలార్పక ఇంకో పక్క కూడా తగలబెడుతున్నా వేమిటి ?" అని అడిగాడు.

" ఆ మాత్రం కూడా తెలీదా ? చూడ బోతే మీరు చాలా అమాయకుల్లా కనిపిస్తున్నారు. ఉష్ణం ఉష్ణేన శీతలం అన్నారు. మంటకు మంట చేరిస్తే తగలబడటం నిలిచిపోతుంది," అన్నాడు ఇంటివాడు.





"మేం రాజధానికి పోతున్నాం. మా వెంట వస్తావా? నీకు రాజుగారి చేత మంచి బహుమానం ఇప్పిస్తాం," అన్నాడు గుణపాలుడు.

ఇల్లు తగలబెట్టుకున్న వాడు సరేనని బయలుదేరాడు.

ముగ్గురూ కలిసి నడుచుకుంటూ మరొక గ్రామానికి చేరుకున్నారు. అక్కడ ఒక అసామీ తన ఇంటికి కొంచెం దూరంలో ఉన్న బావి నుంచి కడవలతో నీరు తీసుకు పోయి తన పెరట్లో ఉన్న బావిలో పోస్తున్నాడు. అతని ఉద్దేశం తన పెరటి బావి నించాలన్నట్టున్నది.

"ఏమయ్యా, ఒక బావి నుంచి నీరు తీసుకుపోయి ఇంకో బావిలో పోస్తున్నా వెందుకు?" అని గుణపాలు డడిగాడు.

దానికి ఆ అసామి, "ఏం చెయ్యమంటారు? ఈ ఎండలకు మా పెరటి నుయ్యి ఎండిపోయింది. నా భార్య మహా బద్ధకస్తురాలు. నీళ్ళు తేవటానికి ఇల్లు దాటిపోదు. అంచేత విధిలేక దూరపు బావిలో నీరు తెచ్చి దొడ్డిబావిలో పోసుకుంటున్నాను," అన్నాడు.

"మేం రాజధానికి పోతున్నాం. మా వెంట వస్తావా? రాజుగారి చేత నీకు మంచి బహుమానం ఇప్పిస్తాం!" అన్నాడు గుణపాలుడు.

ఆ అసామి అందుకు సమ్మతించి వాళ్ళ వెంట బయలుదేరాడు. వాళ్ళు రాజధానిని సమీపిస్తూండగా సుబుద్ధి గుణపాలుడితో, "బాబుగారూ, మనం ఇద్దరు మూర్ఖులనే గదా తీసుకుపోతున్నాం? రాజుగారు అయిదుగురిని గదా తెమ్మన్నారు?" అన్నాడు.

"అంత పెద్ద రాజధానిలో మూర్ఖులకేం తక్కువ? మిగిలినవాళ్ళు మన కక్కడే దొరుకుతారు. అయిదుగురు మూర్ఖులనూ రాజుగారికి చూపించే పూచీ నాదీ! సరా?" అన్నాడు గుణపాలుడు.

ఇద్దరు మూర్ఖులనూ వెంట బెట్టుకుని సుబుద్ధీ, గుణపాలుడూ రాజుగారి దర్బారు ప్రవేశించారు.

మేధావంతుడు సుబుద్ధిని చూసి, "అప్పుడే వచ్చేశావా? అయిదుగురు మూర్ఖులను తెమ్మంటే ముగ్గురినే తెచ్చావేం? ఓహో, పాత మంత్రిగారల్లే వుందే? ఈయన కూడా మూర్ఖుడేనా?" అన్నాడు. సభికులు నవ్వుకున్నారు.

సుబుద్ధి కంగారుపడుతూ, "అంతమాట అనకండి, మహారాజా. ఆయన సహాయంతోనే నేనీ మూర్ఖు లిద్దరినీ తీసుకురాగలిగాను," అన్నాడు.

"అయితే, మిగతా ముగ్గురు మూర్ఖులనూ తీసుకురానందుకు ఆయన తల తీయించాలా ఏం?" అన్నాడు మేధావంతుడు కోపంగా.

"తొందరపడకండి, మహారాజా! మీకు కావలిసిన అయిదుగురు మూర్ఖులనూ చూపిస్తాను. మీ రెరగని ఈ ఇద్దరిని గురించీ వినండి," అంటూ తన ఇల్లు తగలబెట్టుకున్నవాణ్ణి గురించీ, నీళ్ళు తెచ్చి బావిలో పోసినవాణ్ణి గురించీ వివరంగా చెప్పాడు గుణపాలుడు.

ఆయన వాళ్ళ మూర్ఖత్వం వివరిస్తూంటే సభికులు విరగబడి నవ్వి చప్పట్లు కొట్టారు.



మేధావంతుడి కిదేమీ నచ్చలేదు. అతను గుణపాలుణ్ణి, "వాళ్ళమాట సరే, మిగిలిన ముగ్గురు మూర్ఖులనూ త్వరగా చూపండి," అని తొందర చేశాడు.

"ముగ్గురూ మీకు తెలిసినవారే. మీరు, మూర్ఖులను చూస్తాను పట్టుకురమ్మంటే తగినట్టుగా సమాధానం చెప్పక, తానై మూర్ఖులను వెతకనైనాలేక నా సహాయం కోరిన మీ మహామంత్రి ఒక మూర్ఖుడు. మూర్ఖులంటే ఎలా ఉంటారని అడిగిన మీ పట్టపుదేవి ఒక మూర్ఖురాలు. ఆవిడ అడిగింది గదా అని మీ మహామంత్రినే మూర్ఖులను పట్టుకురావటానికి, దేశం మీదికి పంపటమేగాక, వారంరోజుల్లో పట్టుకురాకపోతే తల తీసేస్తానన్న తమ కంటె గొప్ప మూర్ఖుడు ప్రపంచంలో ఉండడు," అన్నాడు గుణపాలుడు.

ఆయన ఇలా ఒక్కొక్క పేరే చెబుతుంటే సభికులు హర్షధ్వానాలు చేసి, చప్పట్లు చరిచి, "మహామంత్రి గుణపాలుడికీ జై!" అని కేకలుపెట్టారు.

మేధావంతుడికి గుణపాలుడి మాటలు విని పట్టరాని ఆగ్రహం వచ్చింది. కాని సభికులంతా ఆయనలాగే, తననూ, తన భార్యనూ, తన మంత్రినీ మూర్ఖుల కింద జమకట్టారని గ్రహించి, కొంత నిగ్రహం తెచ్చుకుని, "అయ్యా, మీరన్న మాటలో కొంత నిజం లేకపోలేదు. మీరు మళ్ళీ మంత్రి పదవి స్వీకరించి నా చేత సక్రమంగా రాజ్యపాలన చేయించాలని కోరుతున్నాను," అన్నాడు.

"నేను వానప్రస్థం చేసుకుంటున్నవాణ్ణి. నాకీ మంత్రి పదవి దేనికి? మూర్ఖులెలా ఉంటారన్న విచారం మానేసి, మూర్ఖత్వం ఎలా ఉంటుందో తెలుసుకుని, మీరే ప్రజారంజకంగా రాజ్యం చేసుకోండి," అని చెప్పి గుణపాలుడు తన ఆశ్రమానికి వెళ్ళిపోయాడు.





# దారిలో దాహం

ఒకసారి పాపన్న నివసించే ఊళ్ళో ఒక విచిత్రమైన, భయంకరమైన పిల్లల రోగం ప్రారంభమయింది. రెండు రోజులపాటు పిల్లలు తిండి తినక, ఆటలాడక, నీరసంగా ఏడుస్తూ ఉంటారు. మూడో రోజున జ్వరం పట్టుకుంటుంది. మూడు రోజులు జ్వరంతో బాధపడి పిల్లలు చచ్చిపోతారు.

ఆ జ్వరానికి చికిత్స చెయ్యగల వైద్యు లెవరూ ఆ ఊళ్ళో లేరు. పది మైళ్ళ దూరాన శివపురంలో ఉండే చక్రవైద్యు డనే ఆయన ఆ జ్వరానికి తగిన చికిత్స చేసి నయం చెయ్యగలిగాడు. ఆ వైద్యుణ్ణి తీసుకు రావాలంటే ఖర్చు ఎక్కువ. అది భరించుకో లేని వాళ్ళు, పిల్లలను శివ పురానికే తీసుకుపోయి, వైద్యుడికి చూపించి, మందు తీసుకుని వచ్చేసేవాళ్ళు. బిడ్డను చూసి పరీక్ష చెయ్యకుండా వైద్యుడు మందిచ్చే వాడు కాడు. జ్వరం తగలక ముందే చికిత్స చెయ్యాలి. జ్వరం తగిలాక ఏ మందూ పని చెయ్యదు. జ్వరం తగలక ముందే చికిత్స ప్రారంభించిన వాళ్ళు వైద్యు డిచ్చిన మందు తోనూ, ఆయన చెప్పిన పథ్యపానాలతోనూ జ్వరం రాకుండా చేసుకో గలిగేవారు.

ఒకనాటి ఉదయం పాపన్న బిడ్డకు జ్వరం రాబోతున్న సూచనలు కనిపించాయి. వెంటనే బిడ్డను చక్రవైద్యుడి వద్దకు తీసుకుపొమ్మని పాపన్న భార్య అన్నది. అయితే సమయానికి పాపన్న సొంత బండి లేదు. ఇంకెవరి బిడ్డనో వైద్యు డింటికి తీసుకు పోవలసి వస్తే, పాపన్న తన బండి నిచ్చాడు. అందుచేత వైద్యుణ్ణి తన ఇంటికి పిలుచుకు వచ్చి బిడ్డను చూపించా లనుకున్నాడు పాపన్న.

ఇంతలో పొరుగింటి సోమన్న ఆత్రంగా వచ్చి, "పాపన్నగారూ, మా బిడ్డకు



ఆ పాడు జ్వరం వచ్చేటట్టున్నది. చక్ర వైద్యుడి వద్దకు తీసుకుపోయి చూపించాలి. మీ బండి కాస్త ఇస్తారా?" అని అడిగాడు.

పాపన్న తనకు కూడా అదే సమస్య వచ్చిందన్నాడు. "పదండి. పోయి వైద్యుణ్ణే తీసుకు వద్దాం," అన్నాడు సోమన్న.

తనకు తోడు దొరికినందుకు పాపన్న కూడా సంతోషించాడు.

ఇద్దరూ శివపురాకి బయలుదేరారు. కొంత దూరం వెళ్ళినాక సోమన్న, "మనం రోడ్డు వెంబడే పోతే పది మైళ్ళ దూరం. ఇటు కొండ పక్కగా అడ్డదారిన వెళితే రెండు మైళ్ళు తగ్గుతుంది," అన్నాడు.

"అయితే అడ్డదారినే పోదాం," అన్నాడు పాపన్న.

ఇంతలోనే రహదారి వెంబడి ఒక గుర్రపు బండి వేగంగా వారిని దాటి వెళ్ళింది. దాన్ని ఒక యువకుడు తోలుతున్నాడు. ఒక యువతి బండిలో కూర్చుని ఉన్నది.

బండి ఎంతో దూరం వెళ్ళకుండానే ఆగిపోయింది. బండిలో ఉన్న స్త్రీ, "అయ్యో సహాయం రండి! సహాయం!" అని ఆర్తనాదం చేసింది.

ఆర్తనాదం వింటూనే పాపన్న బండికేసి పరిగెత్తాడు. సోమన్న విసుక్కున్నాడు.

పాపన్న వెళ్ళి చూసే సరికి, బండి తోలుతూ ఉండిన యువకుడు కళ్ళెం వదిలేసి, బండిలో ఒరిగిపోయి, ఛాతీ పట్టుకుని మూలుగుతూ, "దాహం! మంట!" అంటున్నాడు.

"ఈయన నా భర్త. ఉన్నట్టుండి సుస్తీ చేసింది. బయలుదేరేటప్పుడు చేసిన భోజనంలో ఏదో వికటించింది. కడుపు నొప్పి, దాహం అన్నారు. చెంబులో నీళ్ళు అందించాను. బండి కుదుపుకు చెంబు దొర్లి నీరంతా ఒలికిపోయింది. గ్రహచారం చాలక బండి వాడితో పోట్లాడి, తానే

తోలుతూ వచ్చారు. వా డున్నా కాసిని నీరు తెచ్చి పెట్టును. మీరు ఈ చెంబుతో కాస్త నీరు తెచ్చి పెట్టి పుణ్యం కట్టుకోండి. మీ మేలు మరిచిపోం," అని బండిలో వున్న ఆడది పాపన్నను బతిమాలింది.

"మనం తొందరగా పోవాలి," అని సోమన్న జ్ఞాపకం చేశాడు. కాని పాపన్న వినిపించుకోకుండా చెంబు తీసుకుని దూరాన కనపడే గుడి కేసి పరిగెత్తాడు.

"ఈ మనిషితో పెట్టుకుంటే ఇంతే!" అనుకుని సోమన్న, "నేను పోతున్నా నయ్యోయ్!" అని కేకపెట్టి అడ్డ దారిన కాలు సాగించాడు.

పాపన్న శరవేగంతో గుడి చేరుకుని, అక్కడి పూజారి ఇంటి నుంచి నీరు తీసుకుని బండి వద్దకు తిరిగి వచ్చాడు. యువకుడు నీరు తాగి కొంచెం తేరుకున్నాడు. కాని అతని కడుపునొప్పి తగ్గలేదు. అతను బండిలో పడుకుని, "నేనింక బండి తోలలేను," అన్నాడు. అతను శివపురం జమీందారు కొడుకు; తన భార్యను ఆమె పుట్టింటి నుంచి తన ఇంటికి తీసుకు పోతున్నాడు.

"మీరు విశ్రాంతి తీసుకోండి. నేను బండి తోలి మిమ్మల్ని ఇంటి దగ్గిర దిగవిడిచి



ఆ తరవాత నా పని చూసుకుంటాను," అన్నాడు పాపన్న.

"అందువల్ల మీ పని పాడుకాదు గద?" అన్నది చిన్న జమీందారు భార్య.

"నేను శివపురంలో ఉండే చక్ర వైద్యు డింటికి పోతున్నాను. మా బిడ్డకు విషజ్వరం తగిలి నట్టున్నది," అని చెప్పాడు పాపన్న.

"మేమూ శివపురమే పోతున్నాం గనక మీ కేమీ ఇబ్బంది ఉండదు," అన్నదామె.

పాపన్న బండిని వాయువేగంతో తోలి శివపురం జమీందారు గారింటి ముందు ఆపాడు. జమీందారు కొడుకు భార్యతోసహా

బండి దిగి, ఒక నౌకరును పిలిచి, "వీరిని చక్రవైద్యుడింటికి తీసుకుపో. వైద్యుణ్ణి వీరి వెంట వీరి ఊరికి తీసుకుపోయి, అక్కడి పని పూర్తి అయినాక తిరిగి వైద్యుణ్ణి ఇంటి దగ్గిర దించి రా!" అని పురమాయించాడు.

ఆ బండిలోనే పాపన్న చక్రవైద్యుడింటికి వెళ్ళాడు. జమీందారుగారి బండీ తన ఇంటి ముందాగగానే వైద్యుడు పరిగెత్తుకుంటూ వచ్చి, పాపన్న వచ్చినపని తెలుసుకుని, తనకోసం వేచి ఉన్న రోగులనందరినీ ఉండమని చెప్పి, బండిలో ఎక్కి పాపన్న ఊరికి బయలు దేరాడు. వైద్యుడు వెళ్ళిన కొంత సేపటికి, కాళ్ళు తీపులు పెడుతూ సోమన్న వైద్యుడింటికి చేరుకున్నాడు. అడ్డదారిలో అతనికి ఎదురు దెబ్బలు తగిలాయి, ముళ్ళు గుచ్చుకున్నాయి. ఇంతా శ్రమపడి వస్తే వైద్యుడు బండిలో ఎటో వెళ్ళినట్టు తెలిసింది. ఆయన రాక కెదురు చూస్తూ సోమన్న అక్కడే కూర్చున్నాడు.

ఈ లోపల వైద్యుడు పాపన్న ఇల్లు చేరుకుని, పాపన్న బిడ్డను పరీక్షించి, మందిచ్చి, పథ్యపానాలు చెప్పాడు. తరవాత పాపన్న వైద్యుణ్ణి సోమన్న ఇంటికి తీసుకుపోయి, అతని బిడ్డకూడా మందిప్పించాడు.

వచ్చిన పని అయిపోగానే వైద్యుడు జమీందారుగారి బండిలో తన ఇంటికి తిరిగి వెళ్ళి, బండిని పంపేశాడు.

సోమన్న ఆయనను చూసి తన ఊరూ, పేరూ, తను వచ్చిన పనీ చెప్పాడు.

"నే నిప్పుడు మీ ఊరి నుంచే వస్తున్నాను. వారి బిడ్డకూ, మీ బిడ్డకూ కూడా మందిచ్చాను," అన్నాడు వైద్యుడు.

పాపన్నను వదిలేసి బయలుదేరినందుకు తనకు మంచి శాస్తే జరిగిందనుకుని సోమన్న కాళ్ళీడ్చుకుంటూ దారంతా నడిచి అర్ధ రాత్రి వేళకు ఇల్లు చేరుకున్నాడు.





# యోగ్యతా పరీక్షలు

మాళవ దేశపు రాజు ఏటా పోటీలు పెట్టి రాజోద్యోగులుగా శిక్షణ పొందటానికి తగిన యువకులను తన కొలువు లోకి తీసుకుని, వాళ్ళను తన మంత్రుల వద్దా, కోశాధికారి వద్దా, నగర రక్షకుడి వద్దా, న్యాయాధిపతి వద్దా, సేనాధిపతి కిందా పని నేర్చుకునే టట్లు ఏర్పాటు చేస్తూండేవాడు. కాల క్రమాన ఆ యువకులు పెద్ద పదవుల లోకి రాగలిగేవారు. పరీక్షలు పాండిత్యం లోనూ, గణితం లోనూ, తర్కం మొదలైన శాస్త్రాల లోనూ, అస్త్ర విద్యల లోనూ జరుగు తూవుండేవి.

ఒక ఏడు మంత్రిగారు తన కింద పని నేర్చుకోవటానికి వచ్చిన వారిలో నుంచి ఇద్దరు యువకుల నెన్నుకున్నాడు. ఒకడి పేరు విజయుడు, రెండోవాడి పేరు విమ లుడు. ఇద్దరూ నీతి శాస్త్రం లోనూ, తర్క శాస్త్రం లోనూ సమానమైన పాండిత్యం గల వారే. అందుచేత యుక్తీ, లౌక్యమూ మొద లైన వాటిలో ఎవరు మెరుగో తెలుసుకుందా మని మంత్రి వారి కొక పరీక్ష పెట్టాడు.

ఆయన విమలుడి కొక బుట్టా, విజ యుడి కొక బుట్టా ఇచ్చి, ఇద్దరినీ చెరొక గ్రామానికీ వెళ్ళమనీ, వాటిని ఫలాని ఫలాని వారి కిచ్చి, అవి ముట్టినట్టు రశీదులు పట్టుకు రమ్మనీ, ఆ గ్రామాలు ఆటే దూరం లేవనీ అన్నాడు.

మంత్రి చెప్పిన పని మీద విమలుడూ, విజయుడూ వేరు వేరు మార్గాల వెంట బయలుదేరారు.

విమలుడు మంత్రి చెప్పిన రహదారిన మధ్యాన్నం దాకా నడిచాడు. తాను చేర వలసిన గ్రామం రాలేదు సరికదా, ఆ దారిన మరొక గ్రామమైనా తగలలేదు. పైన ఎండ మాడిపోతున్నది. కడుపులో ఆకలి కరకర లాడుతున్నది. అదృష్టవశాన అతనికి దారి

జంధ్యాల రాధాకృష్ణమూర్తి



పక్కన ఒక దిగుడు బావి కనిపించింది. అత నందులోకి దిగి, చల్లటి నీరు తాగి, ముఖమూ, చేతులూ కడుక్కుని పైకి వచ్చి ఒక చెట్టు కింద కూర్చుని ఏం చెయ్యటమా అని ఆలోచించాడు.

అంతలో ఆ దారిన పోతూ ఎవరో కని పిస్తే, విమలుడు వాళ్ళను ఫలానా గ్రామం ఎంత దూర మని అడిగాడు. సూర్యాస్త మయానికి చేరుకుంటావు లెమ్మని వాళ్ళు చెప్పారు. సమీపంలో ఇంకేదన్నా గ్రామం ఉన్నదా అని అడిగితే లేదన్నారు.

విమలుడికి మంత్రి పైన మంట ఎత్తు కొచ్చింది. ఒక పగలల్లా నడిస్తేనే గాని రాని గ్రామానికి పంపేవాడు, దారిలో తన భోజనం గురించి ఏర్పాటు చెయ్యగూడదా? ఒకవేళ తన భోజనం కూడా బుట్టలోనే ఉన్న దేమో నని అతనికి అనిపించి బుట్ట మూత తీసి చూశాడు.

అందులో కొన్ని చక్కిలా లున్నాయి. వాటి పైన ఒక చీటీ ఉన్నది. ఆ చీటీలో ఇలా రాసి ఉన్నది:

"ఈ బుట్టలో 300 చక్కిలా లున్నవి. అవి ముట్టినట్టు తెలుప గలరు."

చక్కిలాలు అదనంగా ఉన్నాయేమో నని విమలుడు బుట్టలో ఉన్న వాటిని లెక్క పెట్టాడు. మూడు వందలే ఉన్నాయి, ఒక్కటి కూడా మిగులు లేదు.

"మంత్రిత్వ శిక్షణ పొందబోయే వాడికి చక్కిలాల మోత పని ఇస్తాడా మంత్రి? ఆయనకు సభ్యత కూడా తెలిసినట్టు లేదు," అనుకుని విమలుడు బుట్టలో ఉండే చక్కిలాలలో పదిహేను తీసుకుని తినేశాడు. దారిలో ఆకలై తినేశా నంటే మంత్రి తల గొట్టి మొలేస్తాడా అని విమలుడి ధైర్యం.

ఆకలి తీరిపోయి, బడలిక తీరగానే విమలుడు కాలు సాగించి తాను వెళ్ళవలి సిన గ్రామం చేరుకుని, మంత్రి చెప్పిన వారింట చక్కిలా లిచ్చి, 285 చక్కిలాలు

ముట్టి నట్టు వారి నుంచి పత్రం పుచ్చుకుని తిరిగి వచ్చేశాడు.

రెండో గ్రామానికి బయలుదేరిన విజయుడు కూడా మధ్యాహ్నం దాకా నడిచాడు. తాను వెళ్ళ వలసిన గ్రామం సాయంకాలం దాకా రాదని దారిలో ఎదురైన వాళ్ళ వల్ల విని, ఆకలి ఎలా తీర్చుకోవాలా అన్న సమస్యలోపడ్డాడు. మంత్రిగారు తన భోజనం గురించి ఏమీ చెప్పకపోవటం కూడా పరీక్షలో ఒకభాగమే ననుకున్నాడు.

విజయుడు కూడా విమలుడి లాగే తన భోజనం బుట్టలోనే ఉన్నదేమోనని బుట్ట విప్పి చూశాడు. అందులో కూడా, 300 చక్కిలాలు పంపుతున్నామనీ, ముట్టినట్టు రశీదు పంపమనీ చీటీ ఉన్నది. బుట్టలో ఉన్న చక్కిలాలు లెక్క పెడితే సరిగ్గా మూడు వందలే ఉన్నాయి, ఒక్కటి కూడా కొసరు లేదు.

విజయుడు యుక్తిగల వాడు. అతడు ఒక్కొక్క చక్కిలమే తీసి, దాని వెలుపలి చుట్టు మాత్రం తుంచి తన పై బట్టలో వెయ్యసాగాడు. తనకు సరిపడినన్ని చక్కిలాల తుంపులు తుంచుకున్నాక అతను వాటిని తిని, పక్కనే ఉన్న చెరువులో ఇన్ని నీళ్ళు తాగి, మళ్ళీ బయలుదేరి గమ్యస్థానం చేరుకుని, ఇవ్వవలసిన వారికి బుట్ట



ఇచ్చి, మూడు వందల చక్కలాలూ ముట్టి నట్టు వారి నుంచి పత్రం తీసుకుని తిరిగి వచ్చేశాడు.

విమలుడు తెచ్చిన పత్రంలో 285 చక్కలాలే ముట్టినట్లున్నది.

"పదిహేను చక్కలాలూ ఏమయాయి?" అని మంత్రి విమలుణ్ణి అడిగాడు.

"దారిలో ఆకలివేసి నా భత్యం కింద తినేశాను," అన్నాడు విమలుడు.

"దారి భత్యం తీసుకోవటం తప్పేమీ కాదు," అన్నాడు మంత్రి. విజయుడు మూడు వందల చక్కలాలకూ రసీదు తీసుకు రావడం ఆయనకు తృప్తి కలిగించింది. అయినా ఆయన వాళ్ళ లౌక్యం ఏపాటిదో పరీక్షించేటందుకు మరొక పరీక్ష కూడా పెట్టాడు.

ఆయన వారి కోసం రెండు వాహనాలు సిద్ధం చేయించి, వాటిలో రెండు పాత్ర లుంచాడు. ఆయన విమలుణ్ణీ, విజయుణ్ణీ పిలిపించి, "రెండు బళ్ళలోనూ రెండు పాత్రలున్నాయి. రెంటిలోనూ బూడిదే ఉన్నది. మీలో ఒకరు ఒక పాత్రను అవంతీ రాజుకూ, రెండో వారు రెండో పాత్రను అంగరాజుకూ ఇచ్చి వారికి మన పట్ల గల సౌహార్దాలు పెంపొందించి రావాలి," అని చెప్పాడు.



విమలుడు అంగరాజ్యానికీ, విజయుడు అవంతీనగరానికీ వెళ్ళేటట్టు తమలో తామే నిర్ణయించుకున్నారు.

విమలుడు అంగ రాజధానికి వెళ్ళి, తాను మాళవ సంస్థానం నుంచి కానుక తెస్తున్నానని చెప్పి, రాజ దర్శనం పొంది, బూడిద పాత్ర ఇచ్చాడు.

"ఏమిటిది ?" అన్నాడు అంగరాజు.

"బూడిద," అన్నాడు విమలుడు.

"ఈ నీచుణ్ణి ఖైదులో పెట్టండి," అని రాజు అరిచాడు.

మంత్రి రాజును తొందరపడ వద్దని హెచ్చరించి, విమలుడి కా పాత్ర ఇచ్చి పంపినవాడు మాళవ మంత్రి అనీ, విమలు డక్కడికి పరీక్షార్థం వచ్చినవాడే సనీ అడిగి తెలుసుకుని, "నీవు నీ పాత్రతో సహా తిరిగి వెళ్ళు, బాబూ. దాన్ని మేము అంగీకరించ నిరాకరించామని మీ మంత్రిగారితో మా మాటగా చెప్పు!" అన్నాడు.

విమలుడికి చావు తప్పి కన్ను లొట్టపోయి నంత పని అయింది. బతుకు జీవుడా అని అతను చప్పున బండీలో ఎక్కి బూడిద పాత్రతో సహా తిరుగు ప్రయాణమయాడు.

ఈ లోపల విజయుడు కూడా అవంతీ రాజు వద్దకు వెళ్ళాడు. మంత్రి పరీక్ష కొరకై తన కీ ప్రమాదకరమైన పని అప్పగించి



నట్టు అతనికి సులువుగానే తెలిసింది. అందుచేత అతను అవంతీ రాజుకు ఆ బూడిదను ఎలా బహూకరించాలో దారిలోనే నిర్ణయించుకున్నాడు.

అవంతీ రాజు కతను నమస్కారం చేసి, "మహారాజా, నేను మాళవ ఆస్థానం నుంచి తమ కొక చిన్న కానుక తెస్తున్నాను. మా రాజుగారూ, మంత్రిగారూ తమకు శుభ కాంక్షలు తెల్పి ఈ పాత్ర లోని భస్మం తమ కివ్వమన్నారు. ఇటీవల మా రాజుగారు కాశీ యాత్ర చేసి, ఒక యోగీశ్వరుడి అధ్వర్యాన గొప్ప యజ్ఞం చేశారు. ఇది ఆ యజ్ఞగుండం లోని భస్మం. భూత ప్రేతాదులను నివారిస్తుందనీ, తమకూ, తమ ప్రజలకూ ఆయు రారోగ్య ఐశ్వర్యాభి వృద్ధి కలిగిస్తుందనీ, తమకు వారి పట్ల స్నేహ సౌహార్దాలు పెంపొందాలనీ కోరుతూ, వారీభస్మాన్ని తమకు కానుకగా పంపారు," అన్నాడు.

అవంతీ రాజు పరమానంద భరితుడై, ఆ బూడిద పాత్రను తన అంతఃపురానికి పంపించి, విజయుడికి అతిథి సత్కారాల ఏర్పాట్లన్నీ చేయించి, అతను తిరిగి వెళ్ళ టప్పు డతనికీ, మాళవరాజుకూ, మంత్రికీ అంతులేని కానుక లిచ్చి పంపేశాడు.

విమలు డప్పటికే బూడిద పాత్రతో తిరిగి వచ్చి, మంత్రిని చూసి, "రాజుగారి కొలు పంటే ఇలాటి ప్రమాదాలతో కూడిన దైతే నన్ను వదిలెయ్యండి. సెలవు," అని తన ఊరికి వెళ్ళిపోయాడు.

తరవాత విజయుడు వచ్చి, రాజుగారికీ, మంత్రిగారికీ అవంతీ రాజు పంపిన కానుక లందజేసి, తాను తన పని ఎలా సానుకూలం చేసుకు వచ్చినదీ చెప్పి, "మహామంత్రీ, ఇంకేమైనా పరీక్షలు పెడతారా?" అని అడిగాడు.

"లేదు. ఇవాళే నీవు కొలువులో చేర వచ్చు," అన్నాడు మంత్రి.





# యుద్ధకాండ

సుగ్రీవుడు కుంభకర్ణుడి చెవులూ, చెక్కిళ్ళూ కొరికి ఒక్క గంతుతో రాముడి వద్దకు వెళ్ళి పోయాక కుంభకర్ణుడు దేహ మంతా రక్త ధారలు కారుతూ, ఒక్క క్షణం పాటు కొండ లాగా నిలబడి పోయి, తిరిగి యుద్ధ భూమికే బయలుదేరాడు. తన చేతిలో ఆయుధం లేదని జ్ఞాపకం వచ్చి అత నొక భయంకరమైన ముద్గరాన్ని దారి లోనే ఎత్తుకుని యుద్ధరంగానికి వెళ్ళాడు. అక్కడ అతను కోపావేశంతో కనిపించిన ప్రాణు లన్నిటినీ పట్టుకుని తినసాగాడు. వారిలో వానరులతోబాటు రాక్షసులు కూడా తన నోట పడుతున్న సంగతి కూడా కుంభ కర్ణుడు గమనించలేదు. వానరులు అతనికి అందకుండా పారి పోతుంటే కుంభకర్ణుడు వారిని వెన్నంటి తరిమి పట్టుకుని వేల సంఖ్యలో తినేశాడు.

ఇది చూసి లక్ష్మణుడు కుంభకర్ణుణ్ణి ఎదిరించి, అతని పై బాణాలు వేశాడు. కాని ఆ బాణాలను కుంభకర్ణు డే మాత్రమూ లక్ష్య పెట్టలేదు. అతను అందిన వానరు లను పట్టుకుని తింటూ రాముడి కేసి పోసా గాడు. రాము డొక భయంకరమైన అస్త్రాన్ని వేసి కుంభకర్ణుడి రొమ్ములో కొట్టాడు. ఆ దెబ్బకు కుంభకర్ణుడి నోట జ్వాలలు వెలువడ్డాయి. అతను పడిపోయాడు.

కుంభకర్ణుడు మళ్ళీ లేవ కుండా అత నిపై ఎక్కి నుంచోమని లక్ష్మణుడు వాన రులతో చెప్పాడు. అయితే కుంభకర్ణుడు తన పైకి ఎక్కిన వానరులను చీమలను



దులిపినట్టు దులిపేశాడు. అది చూసి రాముడు కుంభకర్ణుణ్ణి సమీపించి తన వింటి నారిని మోగించాడు. కుంభకర్ణుడు లేచి నిలబడి పెద్ద పర్వతంలాగా రాముడి కెదురు వచ్చాడు.

రాము డతన్ని చూసి, "కుంభకర్ణా, భయపడకు! రా! ఇంద్రుణ్ణి జయించావు కాబోలు. నేను ఇంద్రుణ్ణి కాదు, రాముణ్ణి! నిన్నిప్పుడే ఒక్క క్షణంలో చంపబోతు న్నాను," అన్నాడు.

"నేను కూడా విరాధుణ్ణి కాను; కబంధుణ్ణీ, ఖరుణ్ణీ, వాలినీ, మారీచుణ్ణీ కూడా కాను; కుంభకర్ణుణ్ణి! వచ్చాను! నీ ప్రతాప మేమిటో నాకు చూపించు, ఆ తరవాత నిన్ను తినేస్తాను," అన్నాడు కుంభకర్ణుడు.

రాముడు వేసిన మామూలు బాణాలు కుంభకర్ణుణ్ణి ఏమీ చెయ్యలేక పోయాయి; సాలవృక్షాలను ఛేదించి, వాలిని చంపిన బాణాలు కూడా కుంభకర్ణుడి పైన వ్యర్థమై పోయాయి. చేతిలో ఉన్న ముద్గరాన్ని గుండ్రగా తిప్పుతూ రాముడి బాణాలలో కొన్ని తనకు తగలకుండా చేసుకున్నాడు కుంభకర్ణుడు.

అప్పుడు రాముడు కుంభకర్ణుడి పైన వాయువ్యాస్త్రం ప్రయోగించాడు. అది ముద్గరం పట్టి ఉన్న కుంభకర్ణుడి చేతిని ఖండించేసింది. కుంభకర్ణుడు పెద్దగా అరిచాడు. అతడి చెయ్యి తెగినప్పుడు దాని కింద పడి కొందరు వానరులు నలిగి చచ్చారు.

కుంభకర్ణుడు ఒక చెయ్యి పోగొట్టుకుని, రెండో చేత్తో ఒక మహా వృక్షాన్ని పెరికి రాముడి పైకి వచ్చాడు. రాముడు ఐంద్రాస్త్రంతో కుంభకర్ణుడి రెండో చేతిని కూడా, చెట్టుతో సహా, నరికేశాడు. తరవాత అతను రెండు అర్ధచంద్ర బాణాలతో కుంభకర్ణుడి పాదాలు నరికేశాడు. కుంభకర్ణుడు పర్వతం లాగా విరుచుకు పడిపోయి, గుహలాటి నోరు తెరిచి గర్జిస్తుంటే, రాము డా నోటి నిండా

బాణాలు కొట్టాడు. కుంభకర్ణుడు మూర్ఛ పోయి ఉన్న స్థితిలో రాము డొక దివ్యా స్త్రంతో కుంభకర్ణుడి తల నరికేశాడు.

మహా బలశాలి అయిన కుంభకర్ణుడు చావటంతో రాక్షసులు హాహాకారాలు చేశారు. వానరుల ముఖాలు వికసించాయి. కుంభ కర్ణుడు రాముడి చేత చచ్చా డన్న వార్త వింటూనే రావణుడు కొంచెం సేపు మూర్ఛ పోయి తరవాత తమ్ముడి కోసం దుఃఖిం చాడు. అతనితో బాటు మిగిలిన రాక్షస వీరులు కూడా దుఃఖించారు.

తమ్ముడి కోసం దుఃఖిస్తున్న రావణుణ్ణి ఓదార్చి, త్రిశిరుడూ, అతికాయుడూ, దేవాం తకుడూ, నరాంతకుడూ, మహోదరుడూ, మహాపార్శ్వుడూ అనే అరుగురు రాక్షస యోధులు యుద్ధానికి బయలుదేరారు.

తిరిగి రాక్షస వానర సేనల మధ్య దొమ్మి యుద్ధం ఆరంభ మయింది. నరాంతకుడు వానర సేన మధ్యకు జొరబడి, తన ఈటెతో వానరులను వందల సంఖ్యలో చంప సాగాడు. అప్పుడు సుగ్రీవుడు అంగదుణ్ణి అతని పైకి పంపాడు.

అంగదుడు నరాంతకుడికి ఎదురు వెళ్ళి, "ఆ ఈటెను సాధారణ వానరుల పైన ఎందుకు ప్రయోగిస్తావు? దానితో నన్ను



కొట్టు," అన్నాడు. నరాంతకుడు తన ఈటెను బలంగా అంగదుడి రొమ్ము మీద కొట్టాడు. అది కాస్తా విరిగి పడిపోయింది. అంగదుడు నరాంతకు డెక్కి ఉన్న గుర్రాన్ని నెత్తి మీద అరచేత్తో చరిచే సరికి అది తల పగిలి చచ్చిపోయింది. నరాం తకుడు తన పిడికిలి బిగించి గట్టిగా మొత్తే సరికి అంగదుడి తల పగిలి రక్తం కార సాగింది. "వీడి కింత బలం ఉందా?" అని ఆశ్చర్యపడి అంగదుడు తన పిడికిలి బిగించి నరాంతకుడి రొమ్ములో గట్టిగా పొడిచే సరికి నరాంతకుడు నెత్తురు కక్కు కుని చచ్చాడు.



అది చూసి మహెూదరుడూ, దేవాంతకుడూ, త్రిశిరుడూ అంగదుడి పైకి వచ్చారు. ఆ ముగ్గురితోనూ ఒంటరిగా పోరాడుతున్న అంగదుడికి హనుమంతుడూ, నీలుడూ తోడు వచ్చారు. వారి మధ్య జరిగిన యుద్ధంలో హనుమంతుడు దేవాంతకుణ్ణి తల పగల గొట్టి చంపేశాడు. అలాగే నీలుడి చేతిలో మహెూదరుడు చచ్చాడు. మళ్ళీ హనుమంతుడే త్రిశిరుడితో చాలా సేపు యుద్ధం చేసి అతని కత్తితోనే అతని కంఠం నరికేశాడు.

ఈ లోపల రాక్షస వీరులలో ఒకడైన మహాపార్శ్వుడు భయంకరమైన గద ఒకటి తీసుకుని వానరుల పైకి పోయేసరికి, ఋషభుడనే వానరవీరుడు అతనితో తల పడి, అతని గద చేత కొట్టబడి కూడా, ఆ గదతోనే మహాపార్శ్వుడి తల పగల గొట్టేశాడు. మహాపార్శ్వుడు కూడా చావగానే రాక్షసులు ఆయుధాలు పారేసి పారిపోయారు.

అలా పారిపోయే రాక్షసులను చూచి, అతికాయుడు చాలా కోపం చెంది, రెండో కుంభకర్ణుడి లాగా వానర సేన పై పడ్డాడు.

రాముడు అతికాయుణ్ణి దూరానే చూసి ఆశ్చర్యపడి, "పర్వతాకారుడుగా వచ్చే ఈ వీరు డెవరు? ఇతని ధనుస్సులు కూడా అసాధారణంగానే ఉన్నాయి," అని విభీషణుణ్ణి అడిగాడు.

"ఇతను రావణుడికి ధాన్యమాలిని యందు పుట్టిన కొడుకు, అతికాయుడు. లంకకు ఇతను కూడా పెట్టనికోట లాటివాడే. బ్రహ్మ నారాధించి దివ్యాస్త్రాలు పొందిన వాడు. ఇతని సంగతి వెంటనే తేల్చకపోతే వానరసేనను బాణాలతో నాశనం చేయగలడు," అని విభీషణుడు చెప్పాడు.

ఈ లోపల అతికాయుడు సింహనాదం చేస్తూ వానరసేనలో ప్రవేశించాడు. కుముదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, నీలుడూ, శరభుడూ ఏకమై అతన్నెదిరించారు.

అతను వారందరినీ ఉక్కు బాణాలతో కొట్టి బాధించాడు. తరవాత అతను రాముడున్న చోటికి వచ్చి, "నేను అల్పులతో యుద్ధం చెయ్యను. సమర్థు డెవడన్నా ఉంటే నాతో యుద్ధానికి రావచ్చు," అన్నాడు.

ఆ మాట విని లక్ష్మణుడు రోషంతో అతని ముందుకు వచ్చి తన వింటినారిని మోగించి సవాలు చేశాడు.

"లక్ష్మణా, నీవు అర్భకుడివి, నాతో యుద్ధం చేసి, నిష్కారణంగా ప్రాణాలు పోగొట్టుకోకు," అన్నాడు అతికాయుడు.

"నీ ప్రతాపం ఉత్తమాటలలో గాక, చేతలలో చూపించు," అన్నాడు లక్ష్మణుడు.

ఇద్దరూ బాణాలతో యుద్ధం ప్రారంభించారు. ఒకరినొకరు బాణాలతో నొప్పించారు. ఒకరి బాణాల నొకరు పడగొట్టారు. ఒకరు వేసే అస్త్రాలను మరొకరు ప్రతి అస్త్రాలతో ప్రతిఘటించారు. అతికాయుడు అభేద్యమైన కవచం ధరించి ఉండటంచేత లక్ష్మణుడి బాణాలు అతన్ని ఏమీ చెయ్యలేకపోయాయి. ఈ సంగతి గ్రహించి, లక్ష్మణుడు బ్రహ్మాస్త్రం ప్రయోగించి అతికాయుడి తల నరికేశాడు.

ఆరుగురు మహాయోధులైన రాక్షస వీరులూ చచ్చారని వినగానే రావణుడు అంతులేని దుఃఖసముద్రంలో మునిగి





పోయాడు. అప్పుడు ఇంద్రజిత్తు తన తండ్రిని చూసి, "ఇంద్రజిత్తు బతికి ఉండగానే ఈ విచారం దేనికి? నే నిప్పుడే వెళ్ళి ఆ రామలక్ష్మణులను యుద్ధంలో చంపి తిరిగి వస్తాను," అన్నాడు. రావణుడు సరేనన్నాడు.

ఇంద్రజిత్తు ఉత్తమమైన గాడిదలు కట్టిన రథం పైన ఎక్కి, యుద్ధభూమికి బయలు దేరాడు. ధనుర్ధరులైన రాక్షసవీరు లనేకులు ఏనుగుల పైనా, గుర్రాల పైనా ఎక్కి, ప్రాసాలూ, ముద్గరాలూ, ఖడ్గాలూ, గదలూ తీసుకుని ఇంద్రజిత్తు వెంట యుద్ధానికి బయలుదేరారు.

యుద్ధభూమిలో, తన రథం చుట్టూ రాక్షసులను కాపలా ఉంచి, ఇంద్రజిత్తు హవిస్సులను హెూమం చేసి, నల్లమేకను బలి ఇచ్చాడు. అగ్ని పొగలేకుండా మండి అతనికి విజయాన్ని సూచించింది. తరవాత ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రం జపించి, దానితో తన ధనుస్సునూ, రథాన్నీ అభిమంత్రించాడు. ఇదంతా పూర్తి అయాక ఇంద్రజిత్తు తన రథంతోనూ, సారథితోనూ సహా ఆకాశంలోకి వెళ్ళి అంతర్ధానమైపోయాడు. రాక్షససేన అమితోత్సాహంతో యుద్ధానికి కదిలింది.

వానరసేనపై దారుణమైన హత్యాకాండ సాగింది. ప్రముఖ వానరవీరులైన గంధమాదనుడూ, నలుడూ, మైందుడూ, గజుడూ, జాంబవంతుడూ, సుగ్రీవుడూ, ఋషభుడూ, అంగదుడూ, ద్వివిదుడూ ఇంద్రజిత్తు ప్రయోగించిన తీవ్రమైన బాణాలతో గాయపడ్డారు; కొందరు మూర్ఛపోయారు. ఇంక చచ్చిన వానరులకు లెక్కే లేదు. ఇంద్రజిత్తు ఆకాశంలో ఎక్కడ ఉన్నదీ వానరులకు కనిపించనైనా లేదు.

ఇంద్రజిత్తు కురిపించే బాణవర్షం రామలక్ష్మణుల పైన కూడా పడింది. రాముడు లక్ష్మణుడితో, "కంటికైనా కనిపించని ఈ ఇంద్రజిత్తుతో యుద్ధం చెయ్యటం



మనకు సాధ్యమయే పని కాదు. అతని అస్త్రాల ఫలితంగా వానరసేన అంతా మూర్ఛపడి ఉన్నది. మనం కూడా మూర్ఛ వచ్చినట్టు పడిపోతే ఇంద్రజిత్తు తృప్తిపడి వెళ్ళిపోతాడు," అన్నాడు.

రామలక్ష్మణులు కూడా మూర్ఛితులై పడినట్టు కనిపించగానే ఇంద్రజిత్తు పరమ సంతోషంతో లంకకు తిరిగి వెళ్ళాడు. రామలక్ష్మణులు మూర్ఛలో ఉండటం చూసి వానరసేన కలవరం చెందింది. సుగ్రీవుడూ, నీలుడూ, అంగదుడూ, జాంబవంతుడూ నిజంగానే ఒళ్ళు తెలియని మూర్ఛలో ఉన్నారు.

రామలక్ష్మణులను చూసి కంగారు పడే వానరులతో విభీషణుడు, "మీరు కంగారు పడకండి. రామలక్ష్మణులు మూర్ఛ నటిస్తున్నారు, అంతే!" అన్నాడు.

రాత్రి, చీకటి. మూర్ఛపడి ఉన్న వానరులలో ప్రాణాలతో ఉన్నవారెవరో, చచ్చిన వారెవరో తెలియటం లేదు. అందుచేత హనుమంతుడూ, విభీషణుడూ చెరొక కొరవి తీసుకుని వెదక నారంభించారు. ఇంద్రజిత్తు ఆ సాయంకాలం అయిదు గడియల కాలంలో అరవై ఏడు కోట్ల వానరులను పడగొట్టాడు. పడిపోయిన



వారిలో సుగ్రీవుడూ, అంగదుడూ, నీలుడూ శరభుడూ మొదలైన వా రెందరో వారికి కనిపించారు. వారు జాంబవంతుడి కోసం వెతికారు. మహా వృద్ధుడైన జాంబవంతుడు స్పృహతోనే కనిపించాడు.

విభీషణుడు జాంబవంతుణ్ణి సమీపించి, "తాతా, ప్రాణాలతో ఉన్నావు గద!" అన్నాడు.

జాంబవంతుడు హీనస్వరంతో, "ఆ మాట్లాడేది విభీషణుడా, నాయనా? నాకు కళ్ళు కనిపించటం లేదు. హనుమంతుడు బాగా ఉన్నాడా?" అని అడిగాడు.

"తాతా, సుగ్రీవుణ్ణీ, అంగదుణ్ణీ, రామ లక్ష్మణులనూ గురించి అడగకుండా హను మంతుడి మాట అడుగుతున్నావేం?" అని విభీషణు డన్నాడు.

"హనుమంతుడి మాట ఎందు కడిగా నంటావా? చెబుతా విను. హనుమంతు డొక్కడే ఉండి ఈ వానరసేన అంతా చచ్చినా అది బతికి ఉన్నట్టే. అలా కాక హనుమంతుడు పోయి వానరసేన అంతా బతికి ఉన్నప్పటికీ అది చచ్చిన దానితో సమానమే. నాయనా, ఆ హనుమంతుడు బ్రతికి ఉన్నంతకాలమే మాకు జీవితం పైన ఆశ!" అన్నాడు జాంబవంతుడు.

ఈ మాటలు వింటున్న హనుమంతుడు ఎంతో గౌరవభావంతో జాంబవంతుణ్ణి సమీ పించి, అతని కాళ్ళు పట్టుకుని నమ స్కారం చేశాడు.

హనుమంతుడి కంఠం వినిపించగానే జాంబవంతుడికి ప్రాణం లేచి వచ్చింది.

"నాయనా, హనుమంతుడా! ఇలారా! ఈ వానరులను కాపాడే భారం ఇప్పుడు నీదే. ఈ పని నీ వల్ల తప్ప మరొకరి వల్ల కాదు. నీవు సముద్రం దాటి హిమవత్పర్వ తానికి వెళ్ళాలి. అక్కడ అన్నిటి కన్న ఎత్తుగా కనిపించే శిఖరాలు ఋషభమూ, కైలాసమూనూ. ఆ రెంటికీ నడుమగా ఓషధీ పర్వతం ఉన్నది. దాని శిఖరం మీద కాంతి వంతమైన దివ్యౌషధులు నాలుగున్నాయి. వాటి పేరు విశల్యకరణీ, మృతసంజీవనీ, సౌవర్ణకరణీ, సంధానకరణీ. ఆ నాలుగు ఓషధులనూ తీసుకుని శీఘ్రంగా తిరిగిరా!" అని జాంబవంతుడు హనుమంతుణ్ణి హెచ్చ రించాడు. వాటితో వానరులను బ్రతికించ వచ్చునని ఆయన అన్నాడు.

వెంటనే హనుమంతు డా రాత్రివేళ ఒక్క దూకున పర్వత శిఖరం మీదికి ఎక్కి శరీరం పెంచి, రాక్షసులు అడలుకునేటట్టుగా పెడబొబ్బ పెట్టి ఆకాశంలోకి లేచాడు.






# రుక్మాంగదుడు

పూర్వం రుక్మాంగదు డనే రాజుండేవాడు. అతని భార్య సంధ్యావళి. వారికి ధర్మాంగదు డనే కొడుకుండేవాడు. రుక్మాంగదుడు పరమ సాధువు; గొప్ప విష్ణు భక్తుడు. ఏకాదశీ వ్రతంతో సమస్త పాపాలూ పోతాయనీ, తన ప్రజలు నరక బాధ నుంచి తప్పించుకోవాలంటే ఏకాదశీ వ్రతం విధిగా జరపటం ఒకటే మార్గమనీ ఆయన విశ్వాసం. అందుచేత రుక్మాంగదుడు తన ప్రజ లందరూ ఏకాదశీ వ్రతాచరణ చెయ్యాలని చాటింపు వేయించి, అలా చెయ్యని వారికి దండన ఏర్పాటు చేశాడు.

రుక్మాంగదుడు చేసిన ఈ నియమం వల్ల ప్రజలు నరకానికి పోవటం మానేశారు. నరకం పాడు పడిపోంది. చిత్రగుప్తుడికి కూడా పని లేకుండా పోయింది. తనకు నిరుద్యోగం ఏర్పడి నందుకు యముడు చింతిస్తూ ఉండగా అతని వద్దకు నారదుడు వచ్చి, "ఏమిటిది, యమధర్మరాజా? పుట్టెడు చింతలో మునిగి ఉన్నావు?" అని అడిగాడు.

"నారదా, నా లోకానికి ఎలాటి గతి పట్టిందో చూడు. ఆ రుక్మాంగదుడు ప్రజల చేత ఏకాదశీ వ్రతం చేయించడం చేత బ్రహ్మహత్యలు చేసిన వాళ్ళకూ్కడా స్వర్గ ప్రాప్తి కలుగుతున్నది. చిత్రగుప్తుడు మౌనిలాగా మాటా పలుకూ లేకుండా కూర్చుని ఉన్నాడు. నేను దిష్టి బొమ్మలా ఉన్నాను. పని లేని ఈ ఉద్యోగం నా కెందుకు? పరిస్థితి అంతా ఆ బ్రహ్మకు చెప్పుకుంటాను," అన్నాడు యముడు.

నారదుడు యమధర్మరాజును తన తండ్రి వద్దకు తీసుకుపోయాడు. బ్రహ్మ గొప్పగా కొలువుతీరి ఉన్నాడు. యమధర్మ రాజును చూసి బ్రహ్మ చుట్టూ ఉన్నవారు తమలో తాము గుసగుసలాడుకో సాగారు.

అట్ట చివరి బొమ్మ



యముడు పెద్ద పెట్టున ఏడుస్తూ బ్రహ్మ కాళ్ళపై పడ్డాడు. సభలో కలకలం లేచింది. వాయు దేవుడు అందర్నీ నిశ్శబ్దంగా ఉండమని, "నీ దురవస్థ ఏమిటో బ్రహ్మకు విన్నవించు," అని యముడితో అన్నాడు.

"నేను వ్యర్థుణ్ణయిపోయాను. నాకు పని లేకుండా పోయింది. నన్ను లక్ష్య పెట్టేవాడు లేడు. కఠోరమైన తపస్సు వల్లా, యజ్ఞ యాగాదుల వల్లా లభించని పుణ్యం ప్రతి మనిషికీ ఏకాదశీ వ్రతం వల్ల కలుగుతున్నది. ఏకాదశి నాడు ఇంత ఉసిరిక పిండి ఒంటికి పూసుకుని స్నానం చేసి, ఉపవాసం ఉంటే చాలు, ఎటువంటి వాడికైనా ఉన్నత లోకాలు లభిస్తున్నాయి. నా కీ ఉద్యోగం అక్కర్లేదు. మీరే తీసుకుని నా దారిన నన్ను పోనివ్వండి. ఇదుగో నా దండం. ఇదుగో పాప పుణ్యాల పట్టిక. ఇదివరకు దీనిలో వేసిన పద్దు చెరపగల వా డుండేవాడుకాడు. ఇప్పుడు నా ప్రాణానికి రుక్మాంగదుడు దాపరించాడు," అన్నాడు యముడు. ఈ మాట లన్నందుకు బ్రహ్మ యముణ్ణి గట్టిగా చివాట్లు పెట్టాడు. "ఏకాదశీ వ్రతాన్ని నిషేధించడానికి నువ్వెవడివి? ఏకాదశి విష్ణువుకు ప్రీతికరమైన రోజు. ఒక్కసారి హరిని స్మరిస్తేనే పది అశ్వమేధాలు చేసిన పుణ్యం వస్తుంది, తెలుసా? ఇంకా నయం, విష్ణువును గురించి అపచారంగా మాట్లాడినందుకు విష్ణు భక్తులు నిన్ను చితక గొట్టారుకారు. ఈ విషయంలో నేను నీ కే విధంగానూ సహాయ పడలేను," అన్నాడాయన.

యముడు అంతటితో వదిలిపెట్టక, "తాతా, నాకు సహాయం చేసినదాకా నేను తిరిగిపోను. రుక్మాంగదుడు రాజ్య మేలినంత కాలమూ నా ఆట కట్టే. నువు చెయ్యవలసిం దల్లా ఆ రుక్మాంగదుణ్ణి వ్రత నిష్ఠ నుంచి తొలగించటం; ఎలా గయినా అతనికి వ్రత భంగం కలిగించటం. ఈ పని

చేస్తివా, నే నెన్నటికీ ఏకాదశీ వ్రతోపాసకుల జోలికి పోను," అన్నాడు.

బ్రహ్మ కాస్సేపు ధ్యానించి లోకమోహన కరమైన ఒక స్త్రీని సృష్టించాడు. అలా సృష్టి అయిన మోహిని బ్రహ్మతో, "మూడు లోకాలనూ సమ్మోహించ గల నన్ను సృష్టించటంలో నీ ఉద్దేశ మేమిటి?" అన్నది.

బ్రహ్మ మోహినికి రుక్మాంగదుణ్ణి గురించీ, అతను ప్రజలకు విధించిన ఏకాదశీ వ్రతం గురించీ, అందువల్ల యముడికి కలిగిన దుస్థితి గురించీ తెలిపి, రుక్మాంగదుణ్ణి ఆమె ఎలా తన మోహపాశంతో బంధించ వలసినదీ, అతనికి ఎలా వ్రత భంగం కలిగించవలసినదీ చెప్పాడు.

మోహిని బ్రహ్మ వద్ద సెలవు పుచ్చుకుని, దారిలో దేవతల నందరినీ చూసుకుంటూ మందర పర్వతం మీదికి వెళ్ళింది. ఆ పర్వతం పైన వజ్రాయుధం తగిలి, పది బారల మేర ఒక గాటు ఏర్పడి ఉన్నది; దాన్ని వృషలింగ మంటారు. అది చాలా మనోహరమైన ప్రదేశం. మోహిని అక్కడ ఒక చదునైన రాతి పైన కూర్చుని, వీణ వాయిస్తూ పాడ నారంభించింది.

ఈ లోపల రుక్మాంగదుడికి వానప్రస్థం వెళ్ళాలనిపించింది. అతను జంబూ ద్వీప



మంతా ఏకచ్ఛత్రంగా ఏలాడు; సమస్త సుఖాలూ అనుభవించాడు; తాను జీవిత మంతా విష్ణు భక్తిలో గడపటమేగాక, తన పౌరులతో వైకుంఠాన్ని కిక్కిరిసేలాగా చేసి, యమలోకాన్ని పాడుబెట్టాడు. ఇక తాను కోరదగిన దేమీ లేదు. అతని కొడుకు ధర్మాంగదుడు అన్ని విధాలా తండ్రిని మించినవాడు. తండ్రి ఒక ద్వీపానికి రాజైతే, ధర్మాంగదుడు సప్త ద్వీపాలూ జయించాడు. అంత శక్తివంతుడై కూడా ఆ ధర్మాంగదుడు తండ్రినీ, తల్లినీ, తన తండ్రికి గల మూడు పందలమంది భార్యలనూ ఎంతో భక్తితో చూసుకునేవాడు.

రుక్మాంగదుడు తన కొడుక్కు రాజ్యాభిషేకం చేసి, అతను కూడా ప్రజల చేత ఏకాదశీ వ్రతం చేయించేటట్టు చూసి, భార్యతో చెప్పి, గుర్రం ఎక్కి, మేరు పర్వతం చేరబోయాడు. అక్కడ అతనికి మోహిని సంగీతం వినబడింది. వెంటనే అతను గుర్రం మీది నుంచి దిగి సంగీతం వినిపించిన దిక్కుగా అతి వేగంగా పరిగెత్తి మోహిని ఎదటికి వచ్చాడు. ఆమెను చూస్తూనే అతని మనసు మోహవివశమై పోయింది. అతను ఆమె సమీపంగా వెళ్ళి మూర్ఛ పడిపోయాడు.

మోహిని వీణ ఒక పక్క పెట్టి, రుక్మాంగదుడి వద్దకు వెళ్ళి, "రాజా, లే! రాజ్యాన్ని కూడా వదిలివచ్చిన నీకు నన్ను చూడగానే ఇంత మోహం ఎందుకు కలిగింది? నీకు నాతో విహరించాలన్న కోరిక ఉంటే నా నియమానికి కట్టుబడి యథేచ్ఛగా విహరించవచ్చు," అన్నది.

ఈ మాటలు వినగానే రుక్మాంగదుడికి ప్రాణం లేచి వచ్చి నట్టయింది. అతను మోహినితో, "నాకు అందగత్తెలైన భార్యలెందరో ఉన్నారు, కాని నీ అంత అందగత్తెను నే నెక్కడా చూడలేదు. నీవు నా దానవైతే, ఏది కోరినా ఇస్తాను. నా రాజ్యమంతా నీదే, నేనే నీ వాణ్ణి!" అన్నాడు.

మోహిని రుక్మాంగదుడి కుడిచెయ్యి తీసుకుని, "అలా అయితే నన్ను వివాహం చేసుకో. లేని పక్షంలో మనకు కలిగే పుత్రుడు చండాలుడవుతాడు," అన్నది.

రుక్మాంగదుడు మోహినిని ఆమె కోరిన ప్రకారం శాస్త్రోక్తంగా పెళ్ళాడి, "ఇప్పుడు నీ కేది ఇష్టమైతే అది చేద్దాం. ఇక్కడే విహరింతామా? లేక మరొక పర్వతం మీదికి పోదామా? లేక మా యింటికి పోదామా?" అని అడిగాడు.

మోహిని అతని వెంట అతని ఇంటికి రావటానికి ఒప్పుకున్నది. —(ఇంకావుంది)



# 39. స్వర్గాలయం

చీనాలోని ఆలయా లన్నిటిలోకీ ప్రసిద్ధమైన ఈ స్వర్గాలయాన్ని 1420 లో యుంగ్-లో చక్రవర్తి కట్టించాడు. ఇక్కడ చక్రవర్తి ఒక్కడే అర్చన చేసి, ఏడాదికి మూడు సార్లు బలులు ఇచ్చేవాడు. స్వర్గం లాగా ఉండగలందులకు దీని నిర్మాణం ఆ మూలాగ్రం వలయాకారంగా ఉంచబడింది.



Photo by A. S. Lakdawala



బహుమతి
పొందిన వ్యాఖ్య

మనసు వెన్న

పంపినవారు :
డి. వి. శాస్త్రి, విజయనగరం

Photo by P. V. Subramaniam



బహుమతి
పొందిన వ్యాఖ్య

వయసు పిన్న

పంపినవారు :
డి. వి. శాస్త్రి, విజయనగరం

# ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫొటోల వ్యాఖ్యలు 1965 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటింపబడును.





★ పై ఫొటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫిబ్రవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మనసు వెన్న

రెండవ ఫోటో: వయసు పిన్న

పంపినవారు: ద్వారకాభమిడిపాటి విశ్వనాథశాస్త్రి,

విజయనగరం.

బహుమతి మొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'






జవహర్ లాల్ నెహ్రూ
యిలా అన్నారు. "భావిలో సౌఖ్యానికి
విశ్రాంతికి తావులేదు. మనము ఎడతెగక
కష్టపడి పనిచేయాలి." కనుక
ఆయన ఆత్మకు శాంతి చేకూర్చడానికి ఎక్కువ పనిచేసి
జాతీయ సంపదకు ఎక్కువ ఉత్పత్తి చేద్దామని కంకణము కట్టుకొందాము.






గ్వాలియర్ & హైదరాబాదు

OJB-136 TL

# "ఆంధ్ర ప్రదేశ్"

సచిత్ర మాస పత్రిక

## చదవండి ప్రకటనలు ఇవ్వండి



అనేక క్రొత్త శీర్షికలతో ఆకర్షణీయంగా వెలువడుతున్న
యీ పత్రిక ప్రతి కుటుంబం చదవదగింది



ప్రతి నెలా ౩౫,౦౦౦ ప్రతులకు పైగా అమ్ముడవుతున్నాయి

**తెలుగు, ఇంగ్లీషు, వుర్దూ, హిందీ**

భాషలలో ప్రచురించబడుతున్నది

విడి ప్రతి వెల ౨౫ పైసలు మాత్రమే



ఇతర వివరాలకు :

డైరెక్టర్, సమాచార పౌర సంబంధాల శాఖ, హైదరాబాదుకు వ్రాయండి

ఆ జలుబును
వెంటనే
పోగొట్టుకోండి

# అమృతాంజనం వాడి

## శీఘ్రంగా నివారణ పొందండి

నిరపాయకరంగా గుండ జలుబుకు, సాధారణ జలుబుకు అమోఘంగా గుణాన్నిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. కండనొప్పికి, తలనొప్పికి, బెణుకులకు కూడా అమోఘంగా పనిచేస్తుంది. కొంచెం కొంచెమే ఉపయోగించ వలసి ఉంటుంది కొబట్టి ఒక సీసా మీ కుటుంబాని కర్ఠతా నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ళ ప్రసిద్ధిపొందిన నమ్మకమైన గృహ ఔషధం.

అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు.




అమృతాంజన్ లిమిటెడ్
మద్రాసు • బొంబాయి • కలకత్తా • ఢిల్లీ

JWT/AM/2817

# తప్పక చూడండి

SRI VANI FILMS

శ్రీ వాణీ ఫిలింస్



# నాదీ ఆడజన్మే

దర్శకత్వం :
**A.C. త్రిలోకచందర్** M.A.,

విజయ

నిర్మాత :
**S.V. రంగారావు** B.Sc.,

స్టూడియో :
**ఏ.వి.ఎమ్**

FOR PRECISION IN...



Colour Printing

By Letterpress...

...Its B. N. K's., superb printing that makes all the difference. Its printing experience of over 30 years is at the back of this press superbly equipped with modern machineries and technicians of highest calibre.

**B.N.K.** *PRESS PRIVATE LIMITED.*

*CHANDAMAMA BUILDINGS,*

*MADRAS-26*

